# కురళ్

లేక

# తిరువళ్లువరు సూక్తులు


అనువాదకుడు

ముదిగంటి జగ్గన్న శాస్త్రి



[illegible]ారు గ్రంథమండలి

తణుకు :: ప. గో. జిల్లా

# కురల్

లేక

# తిరువళ్లువరు సూక్తులు

అనువాదకుడు

ముదిగంటి జగ్గన్నశాస్త్రి

'అత్యున్నతము, అతిపవిత్రము నగు మానవ
భావ ప్రకటనలలో నొకటి' – యం. ఏరియల్

'గ్రీసు దేశమున హోమరు రచనలవలె తమిళ ప్రజలలో
నత్యున్నతశ్రేణికి చెందిన నైతికసూక్తినిధి' — గవర్

పల్లెటూరు గ్రంథమండలి
తణుకు :: ప. గో. జిల్లా

# మ న వి

అనువాదము అనువాదమే. అనువాదకుడు 'హంతకుడు' అను లోకోక్తికూడ కలదు. అందులోను గ్రంథకర్త వ్రాసిన భాషనుండికాక మరియొకభాషనుండి యనువదించుట మరింత ప్రమాదము. ఇది క్షంతవ్యముకూడ కాకపోవచ్చును. అయినను నాకు తమిళము రాకపోవుటచేతను, తమిళమిత్రులలో చాలమంది (నాతో జయిలులోనున్నవారు) యిప్పటి తమిళ భాషకును కురల్‌లోని భాషకును నెంతేని వ్యత్యాసము కలదని చెప్పుటచేతను, అది సామాన్యులకందనిభాష యగుటచేతను నేను అనువాదములలోనికెల్ల మెప్పువడసిన కీర్తిశేషుడగు వి. వి. యస్. అయ్యరుగారి యాంగ్లానువాదమునుండి దీనిని తెనిగించితిని.

ఈసూక్తుల నేదోయొకవిధముగ నాంధ్రప్రజల కందింపవలెనను ఆసక్తిచే నే నీపనికి సాహసించితిని. కనుక ఇందలి దోషములు నావికాని మరియొకరివి కావు. ఇందలి తమిళ భాషారహస్యము తెలిసిన పండితులు నాదోషములను తెలిపినచో పునర్ముద్రణములో సవరించుకొందును.

ముదిగంటి జగన్నశాస్త్రి

# ఉపోద్ఘాతము

తిరువళ్లువరు అను తమిళకవి, ఋషిసత్తముడు, మహాభక్తుడు కురల్ అను గ్రంథము రచించెను. 'కురల్' అనగా ద్విపద. ఇది తమిళభాషలో నొక మహాకావ్యము. ఇది యీ భాషలోని కావ్యములలో నతి చిన్నదైనను కడుమిన్నయైనదని పరిపూర్ణత నొందినదని భావింపబడుచున్నది. ఇది ప్రాచీన కావ్యము. దీనిని రచించిన తిరువళ్లువరు సుమారు రెండువేల సంవత్సరముల క్రిందట జీవించెనని చెప్పుదురు.

మన పూర్వకవు లందరివలెనే యీకవినిగురించి కూడ మన కంతగా తెలియదు. ఇతడు పంచమజాతిలో జనించినట్లు సాంప్రదాయము చెప్పుచున్నది. ఈ కవిపేరు చరిత్రకు తెలియదు. తిరువళ్లువరు అనగా "వళ్లువ, జాతిభక్తుడు" అని యర్థము. వళ్లువ జాతివారు పంచములు. వీరు రాజశాసనముల నేనుగుల మీద నెక్కి దండోరా పూర్వకముగ చాటింపు వేసెడివారు. ఇతడు పాండ్యదేశ రాజధానియైన మధురలో భగవానుడను నొక బ్రాహ్మణునకును ఆదియను పంచమ స్త్రీకిని జనించినట్లు ప్రతీతికలదు. ఈ కన్నియ నొక బ్రాహ్మణుడు పెంచి భగవానునకు వివాహము చేసెనట. ఈ దంపతులకు మరి యేడుగురు బిడ్డలు పుట్టిరి. వారందరు కవులేయైనట్లు చెప్పబడుచున్నది.

ఈ కవి మధురనుండి చెన్నపురికి వచ్చి మైలపురములో స్థిరనివాస మేర్పరచు కొనెననియు నేతవృత్తి నవలంబించె ననియు చెప్పుదురు. ఇతని గృహజీవిత మతిపవిత్రమైనది, ఆదర్శ ప్రాయమైనది. ఇతని భార్య వాసుకి. ఈమె మహాపతివ్రత. ఈ యిరువురి దాంపత్యమును గురించి యనేక కథలు కలవు. ఈమెను పెండ్లియాడుటకు పూర్వ మితడొక పరీక్ష చేసెను. ఇతడు కొన్ని యినుపమేకులను తెచ్చి వంటచేసి పెట్టుమని కోరినట్లు, ఆమె యెట్టి సంశయము చూపక వంటచేసినట్లు, ఆమెయే తనకు తగిన భార్యయని యత డామెను వివాహ మాడినట్లు చరిత్ర కలదు.

ఈ దంపతుల కీర్తి నలువైపుల ప్రాకెను. ఒకనా డొక ఋషి యిందలి సత్యమును తెలుసుకొనవలెననియు తననుకూడ వివాహము చేసుకొనవలసినదే యని యతడు సలహా చెప్పు నేమో చూడవలెననియు వచ్చి యతని ననేకవిధముల ప్రశ్నించెను. అతడు వానికి సరాసరి జవాబులు చెప్పక తన కతిథిగ కొన్ని దినము లుండవలెననియు తరువాత నతనికి తోచినట్లు చేయవచ్చుననియు చెప్పెను. ఋషి దాని కంగీక రించి యతని కతిథిగ కొన్ని దినము లుండెను.

ఒకనాటి ప్రాతఃకాలమున వారు చల్ది కుడుచుచుండిరి. వాసుకి యన్నము వడ్డించి నీరు తెచ్చుటకు దొడ్డినూతికివెళ్లెను. గృహమేధి, యతిథి భోజనము చేయుచుండిరి. వడ్డించిన వంట కము లన్నియు వేడిగ నుండుటచే తిరువళ్లువరు భార్యను కేక

వేసి పదార్థములు వేడిగ నుండుటచే తినుట కష్టముగ నున్న దని చెప్పెను. ఆమె పరుగుపరుగున వచ్చి విసినకఱ్ఱతో విసర నారంభించెను. ఆశ్చర్య మేమనగా నామె విసరుచుండ వి స్తరి నుండి, చల్దినుండి యావిరి బయలు దేరెను. చల్ది యనుమాటలోనే వడ్డించిన పదార్థములు వేడివి కావని మనకు తెలియుచున్నది.

దీనిని మించిన చిత్ర మింకొకటి కలదు. భర్త కేక వేయుట తోడనే యామె తోడుచుఁ డుచు విడిచివచ్చిన చేద యేయాధా రము లేకుండ గాలిలో నట్లే నిలచియుండుట నాయతిథి చూచెను.

మరి యొకనాడు తిరువళ్లువరు నేతనేయుచు కండెపోయి నట్లు నటించి దానిని వెదకుటకు దీపము తెమ్మని భార్య నాజ్ఞాపింపగ పట్టపగలు పన్నెండు గంటల వేళ దీప మెందు కను సందేహము లేకుండ నామె యొక దీపమును వెలిగించి తెచ్చి యిచ్చెను. ఇట్టివే మరికొన్ని ఘట్టముల నా యతిథి చూచెను. తిరువళ్లువరు యేమియు చెప్ప నవసరము లేకుండ గనే యా ఋషి సందేహము వీడిపోయెను. వాసుకివంటి భార్య యున్నపుడు గృహస్థాశ్రమమే యన్ని యాశ్రమములకన్న మే లని యతనికి తెలిసెను.

ఈ పవిత్ర దాంపత్య రసానుభావము నుండియే 'కురల్' లోని మూడవ భాగమైన 'కామము' అను చతుర్విధ పురు షార్థములలోని మూడవ యర్థమునకు సంబంధించిన యీ యపూర్వ ప్రేమగాథ తిరువళ్లువరు ప్రేమ రసానుభూతితో తనిసిన లేఖినినుండి బయల్వెడలె ననుటలో నాశ్చర్య మేమున్నది.

ఈ కవి మధురనుండి చెన్నపురికి వచ్చి మైలపురములో స్థిరనివాస మేర్పరచు కొనెననియు నేతవృత్తి నవలంబించె ననియు చెప్పుదురు. ఇతని గృహజీవిత మతిపవిత్రమైనది, ఆదర్శ ప్రాయమైనది. ఇతని భార్య వాసుకి. ఈమె మహాపతివ్రత. ఈ యిరువురి దాంపత్యమును గురించి యనేక కథలు కలవు. ఈమెను పెండ్లియాడుటకు పూర్వ మితడొక పరీక్ష చేసెను. ఇతడు కొన్ని యినుపమేకులను తెచ్చి వంటచేసి పెట్టుమని కోరినట్లు, ఆమె యెట్టి సంశయము చూపక వంటచేసినట్లు, ఆమెయే తనకు తగిన భార్యయని యతడామెను వివాహ మాడినట్లు చరిత్ర కలదు.

ఈ దంపతుల కీర్తి నలువైపుల ప్రాకెను. ఒకనాడొక ఋషి యిందలి సత్యమును తెలుసుకొనవలెననియు తననుకూడ వివాహము చేసుకొనవలసినదే యని యతడు సలహా చెప్పునేమో చూడవలెననియు వచ్చి యతని ననేకవిధముల ప్రశ్నించెను. అతడు వానికి సరాసరి జవాబులు చెప్పక తన కతిథిగ కొన్ని దినము లుండవలెననియు తరువాత నతనికి తోచినట్లు చేయవచ్చుననియు చెప్పెను. ఋషి దాని కంగీక రించి యతని కతిథిగ కొన్ని దినము లుండెను.

ఒకనాటి ప్రాతఃకాలమున వారు చల్ది కుడుచుచుండిరి. వాసుకి యన్నము వడ్డించి నీరు తెచ్చుటకు దొడ్డినూతికివెళ్లెను. గృహమేధి, యతిథి భోజనము చేయుచుండిరి. వడ్డించిన వంట కము లన్నియు వేడిగ నుండుటచే తిరువళ్లువరు భార్యను కేక

వేసి పదార్థములు వేడిగ నుండుటచే తినుట కష్టముగ నున్న దని చెప్పెను. ఆమె పరుగుపరుగున వచ్చి విసినకర్రతో విసర నారంభించెను. ఆశ్చర్య మేమనగా నామె విసరుచుండ వి స్తరి నుండి, చల్దినుండి యావిరి బయలు దేరెను. చల్ది యనుమాటలోనే వడ్డించిన పదార్థములు వేడివి కావని మనకు తెలియుచున్నది.

దీనిని మించిన చిత్ర మింకొకటి కలదు. భ ర్త కేకవేయుట తోడనే యామె తోడుచుండుచు విడిచివచ్చినచేద యేయాధా రము లేకుండ గాలిలో నట్లేనిలచియుండుట నాయతిథి చూచెను.

మరి యొకనాడు తిరువళ్లువరు నేతనేయుచు కండెపోయి నట్లు నటించి దానిని వెదకుటకు దీపము తెమ్మని భార్య నాజ్ఞాపింపగ పట్టపగలు పన్నెండు గంటల వేళ దీప మెందు కను సందేహము లేకుండ నామె యొక దీపమును వెలిగించి తెచ్చి యిచ్చెను. ఇట్టివే మరికొన్ని ఘట్టముల నా యతిథి చూచెను. తిరువళ్లువరు యేమియు చెప్ప నవసరము లేకుండ గనే యా ఋషి సందేహము వీడిపోయెను. వాసుకివంటి భార్య యున్నపుడు గృహస్థాశ్రమమే యన్ని యాశ్రమములకన్న మే లని యతనికి తెలిసెను.

ఈ పవిత్ర దాంపత్య రసానుభావము నుండియే 'కురల్' లోని మూడవ భాగమైన 'కామము' అను చతుర్విధ పురు షార్థములలోని మూడవ యర్థమునకు సంబంధించిన యీ యపూర్వ ప్రేమగాధ తిరువళ్లువరు ప్రేమ రసానుభూతితో తనిసిన లేఖినినుండి బయల్వెడలె ననుటలో నాశ్చర్య మేమున్నది.

ఈ కవి తన భార్యతో సమస్త సుఖముల ననుభవించి యామె యీ లోకమును వీడిపోయినపు డిట్లు వాపోయెనట.

"ప్రేయసీ!" నా కొరకు సరసాన్నపానములను వండి నన్ను సదా తనిపితివి. నా మాటల నెన్నడును జవదాటవైతివి. రాత్రులు నా పాదములను మెల్లన యొత్తి నేను నిద్రింప నిద్రింతువు. నాకు పూర్వమే నిద్ర మేల్కాంచి కార్యములలో నిమగ్నరాల వగుదువు. నిష్కళంకమూర్తీ! నీవిపుడు నన్ను వీడి పోవుచుంటివా! ఈ నా నేత్రము లిక నెన్నడు నిద్రింపగలవు?"

వాసుకి చనిపోయిన తరువాత తిరువళ్ళువరు గృహస్థాశ్రమము వీడి సన్యసించెను.

తిరువళ్ళువరు సోదరి అవ్వాయి యను నామె గొప్ప కవయిత్రి. ఆమె సూక్తులు నేటికిని యరవములో సుప్రసిద్ధములై యున్నవి. ఈమె నిరంతర భగవద్ధ్యానపరాయణయై వివాహము నొల్లక నిత్యబ్రహ్మచారిణియై బ్రహ్మసాయుజ్యమును పొందెను.

తిరువళ్ళువరు రచించిన 'కురల్' లోని విషయము లొకకాలమునకు నొక దేశమునకు మాత్రమే సంబంధించినవి గాక సర్వకాల సర్వదేశములకును వర్తించునవి. కనుకనే తమిళకవులు దీనిని 'తమిళవేదము' అని స్తుతి చేయుదురు. ఇది ల్యాటిను, జర్మను, ఫ్రెంచి, యింగ్లీషు మొదలగు పాశ్చాత్య భాషలలోనికి వివిధకాలములలో తర్జుమా చేయబడి మంచి ప్రాశస్త్యము నొందెను.

అనువాదకుడు.

# ప్ర వే శి క



ఒకటవ యధ్యాయము

## ఈ శ్వ ర స్తు తి

1. అకారముతో శబ్దప్రపంచము ప్రారంభ మగుచున్నది. అట్లే జీవించు సమస్తమునకు పురాణపురుషుడైన పరాత్పరుడు మూలకారణుడు లేక ప్రాతిపదిక.

2. ఆ సర్వజ్ఞుని పవిత్రపదకమలములను భజింపవేని నీకెంత విద్యయున్నను నేమి ఫలము ?

3. పుష్పములమీాద నడచిన యాపరాత్పరుని పదకమలముల నాశ్రయించిన వారి దినములే యీప్రపంచములో నక్షయమగును.

4. రాగద్వేషాతీతుడగు వానిపదకమలముల నాశ్లేషించుకొని యుండువారి నెన్నడు జీవితదోషములు స్పృశింపజాలవు.

5. భక్తిశ్రద్ధలతో నీశ్వరస్తుతి చేయువారిని దుఃఖములనే ప్రసాదించు సుకర్మ, దుష్కర్మ ఫలితము లంటజాలవు.

6. పంచేంద్రియ కోరికలను భస్మీపటలము చేసిన యాపరాత్పరుని ధర్మమార్గముల ననుసరించువారి దినములీ భూమిమీాద అక్షయములగును.

7. అనన్యుడైన యాపరాత్పరుని పదముల నాశ్రయించిన వారొక్కరే దుఃఖసముద్రమునుండి తప్పించుకొన గలుగుదురు.

8. ధర్మసింధువగు పురాణపురుషుని పదముల నాశ్రయించినవా రొక్కరే విషయభోగములను, ఐశ్వర్యవీచికలను తరింప గలుగుదురు.

9. అష్టైశ్వర్యములచే విరాజిల్లు భగవానుని పదములకు మ్రొక్కనితల తమంతతాము చూడజాలని యింద్రియములవలె వ్యర్థము, నిరర్థకము.

10. ఈశ్వరచరణముల నాశ్రయించువా రొక్కరే జనన మరణసముద్రమును దాటగలరు. తక్కినవారు దాని కసమర్థులు.

రెండవ యధ్యాయము

# వర్షస్తుతి

11. అవిరళ వర్షధారలచేతనే యీ పృథ్వి భరింపబడు చున్నది. కనుక నీవు వర్షమును దేవతలకు ప్రీతికరమగు అమృతమువలె భావింపవలెను.

12. రుచ్యమైన ప్రతియాహారము మానవునకు వర్షము ప్రసాదించిన వరమే. చివరకు వర్షముకూడ నతనికొక విధమగు ఆహారమే.

13. ఈ విశాల ప్రపంచమంతయు జలధి పరివేష్టితమైనను వర్షమే లేనిచో క్షామము తాండవమాడును.

14. ఆకాశనిధులు శుష్కించిపోయినచో వ్యవసాయకుడు నాగలి కట్టిపెట్టవలసినదే.

15. వర్షమే నాశము చేయును. అదియే తాను నాశము చేసిన వారిని తిరిగి రక్షించును.

16. వర్షమే కురియనిచో గడ్డిపరకకూడ మొలవజాలదు.

17. సముద్రగర్భమునుండి యాకాశము నీటినిపీల్చి తిరిగి దానికిచ్చివేయనిచో సముద్రమే పాడి తప్పిపోవును.

18. ఆకసమే యెండిపోయినచో దేవతలకు హవిస్సులుగాని భూమిమీద పర్వములుగాని యెట్లు నెరవేరగలవు?

19. ఆకాశము తన జల్లుల నుపసంహరించినచో ఈ విశాల ప్రపంచముమీద దానధర్మములు, తపశ్చర్యలు, యితర సుకృతములు జరుపబడ నేరవు.

20. నీరులేనిచో యీ పృథ్వీమీద నేక్రియయు జరుగ నేరదు. కనుక నతి ధర్మాత్ముల శీలముకూడ చివరకు వర్షపాతముమీదనే యాధారపడి యుండును.

మూడవ యధ్యాయము

## సన్యాస మాహాత్మ్యము

21. ఇంద్రియ భోగములు వీడి తాపస జీవితము వరించు వారి ఘనత నన్నిశాస్త్రములు తక్కిన ప్రతిగుణముకంటె మిన్నగ పరిగణించు చున్నవి.

22. సన్యాసుల మాహాత్మ్యమున కెవరు విలువ కట్ట గలరు అంతకంటె మరణించినవారి సంఖ్య లెక్కించుట సుఖతరము.

23. ఇహమును పరముతో తూచి యీ ప్రపంచమును త్యజించినవారి మాహాత్మ్యముచేతనే యీపృథ్వి ప్రకాశమాన మగుచున్నది.

24. అంకుశము మదగజమును లొంగదీయునట్లు పంచేంద్రియములను తన యిచ్ఛాశక్తిచేత వశపరచుకొనువాడు స్వర్గ సీమ నలంకరింపదగినవాడు.

25. తన పంచేంద్రియదాహముల నుపశమింపజేసిన ఋషి సత్తముని శక్తి గ్రహింపగోరుదువేని దేవతల రాజైన ఆ యింద్రుని చూడుము. అతని సాదృశ్య మొక్కటియేచాలును.

26. అసాధ్యమైనదానిని సాధింపగలవారే మహాత్ములు. దానిని సాధింపలేనివారు దుర్బలులు.

27. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధపంచకముయొక్క యథార్థ విలువను గుర్తించిన మహనీయుడే యీప్రపంచమును శాసింపగలడు.

28. ఎవరిమాట శాసనమో యట్టివారి ఘనతనే శాస్త్రములు ప్రపంచమునకు చాటును.

29. త్యాగపర్వతము నధిష్ఠించినవాని కోపము నొక్క నిముసమైనను భరించుట దుస్సాధ్యము.

30. బ్రాహ్మణులనుకూడ త్యాగులవలె పరిగణింపదగును. ఏలనన వారు సర్వజీవులయందు దయగలవారు.

నాల్గవ యధ్యాయము

# ధర్మము యొక్క మహనీయత

31. ధర్మము స్వర్గద్వారము. అది యైశ్వర్యమును కూడ ప్రసాదించును. కనుక ధర్మముకంటె లాభదాయకమైన దేది కలదు ?

32. ధర్మమును మించిన మంచిలేదు. దానిని విస్మరించు టను మించిన చెడుగు లేదు.

33. సత్కర్మల నాచరించుటయందు విసుగు చెందకుము. వానిని నీ యావచ్ఛక్తితోను ప్రతిసాధన ద్వారా యాచ రింపుము.

34. నీహృదయమును పవిత్రముగ నుంచుకొనుము. ఈ యొక్క విధిలోనే ధర్మసర్వస్వ మంతయు నిమిడియున్నది. తక్కిన విషయ ప్రపంచమంతయు కేవల శుష్కతతంగము.

35. అసూయ, పేరాశ, క్రోధము, వాక్పారుష్యము — ఈనాల్గింటిని విడిచిపెట్టుము. ధర్మము నార్జించుట కిదియే మార్గము.

36. "నేను క్రమముగ ధర్మపరుడ నగుదును." అని నీ హృదయములో ననుకొనకుము. ఆలసింపక సత్కర్మల నాచ రించుటకు ప్రారంభింపుము. ధర్మమే నీవు మరణించుదినమున నీతోనుండు అమరసహవాసి.

37. ధర్మపరుడైనచో మానవునకు చేకూరు ఫలమేమి? అని నీవు నన్ను అడుగవద్దు. పల్లకి మోయువానిని అందులో నెక్కి యూరేగువానిని చూడుము.

38. నీ జీవితములో నీవొక్క దినమునైన వృథపుచ్చక మంచియే చేయుచుందువేని జన్మరాహిత్యమైన తెరవున నడచెదవు.

39. పవిత్రజీవితము ద్వారా ప్రభవించు సుఖములే సంతోషములు. తక్కిన భోగములన్నియు నవమానములను, దుఃఖములను మాత్రమే తెచ్చిపెట్టును.

40. ధర్మముమీద ప్రతిష్ఠింపబడు కర్మమాత్రమే చేయదగినది. జ్ఞానులు గర్హించు కార్యములు పరిత్యజింప దగినవి.

ప్రవేశిక సమాప్తము.

---

మొదటి భాగము

ధర్మము.

# ఒకటవ ప్రకరణము



గార్హస్థ్యము

అయిదవ యధ్యాయము

## కుటుంబ జీవితము

41. తక్కిన మూడు ఆశ్రమములవారికి (బ్రహ్మచర్య; వనప్రస్థ, సన్న్యాస) గృహస్థే ప్రాణాధారము.

42. పితృదేవతలకు, అనాథులకు, సన్యాసులకు గృహమేధి పరమమిత్రుడు.

43. గృహమేధి చేయవలసిన ధర్మములైదుకలవు. పితృదేవతలకు తర్పణములు వదలుట, దేవతలకు యజ్ఞములు సేయుట, అతిథిసత్కారము, బంధుమిత్రులకు సహాయము, తననుగురించి తాను యోచించుకొనుట.

44. జ్ఞానులైనవారి మందలింపులకు భయపడుచు, తాను కుడుచుటకుపూర్వ మితరులకు దానధర్మములు చేయువారి సంతతి యెన్నటికి నశింపదు.

45. ఏగృహములో ప్రేమ, ధర్మము తాండవించునో యట్టి గృహమే పూర్ణమైనది. దాని గమ్యము పూర్తిగా సిద్ధించును.

46. మానవుడు యథోచితముగ గృహస్థధర్మము నాచరించిన యెడల తదితరవిధుల నవలంబింపవలసిన పనియేమికలదు?

47. ధర్మబద్ధముగ గృహజీవితమును నడుపుచు దానికి సంబంధించిన యన్నివిధులను తు.చ. తప్పకుండ నాచరించువారే మోక్షము నన్వేషించువారిలో నుత్తమోత్తములు.

48. తనకుతాను పవిత్రజీవితము గడుపుచు నితరులకు వారి వారి నిష్ఠలలో నుండునట్లు సాయపడుచుండు గృహమేధియే ప్రార్థనలు, ఉపవాసాది కర్మకాండ వ్రతములు చేయువారికంటె గొప్పఋషి.

49. ధర్మము ప్రత్యేకము వివాహజీవితమునకే సంబంధించినది. మంచిపేరే దాని కలంకారము.

50. తను జీవింపవలసిన విధమున జీవించు గృహమేధి మానవులలో దైవముగ పరిగణింపబడును.

ఆరవ యధ్యాయము

## ధర్మపత్ని చేయు మేలు

51. భార్యకుండవలసిన ప్రతి సుగుణము కలిగియుండి తన భర్తయొక్క గడనకు మించని వ్యయముచేయు గుణవతియే సహధర్మచారిణి.

52. భార్యకుండవలసిన పవిత్రపత్నీ ధర్మము ఆమెలో లేనినా డిక నెన్ని సంపదలున్నను బూడిదలో పోసిన పన్నీరువంటివే యగును.

53. భార్యయే సుగుణవంతురాలగుచో నిక దారిద్ర్యమెచట కలదు ? ఆమెలో గుణమే లేకపోయినచో నిక నైశ్వర్య మెచట కలదు ?

54. స్త్రీ శీలసంపదచే నలరారు పతివ్రతయే యైనపు డామెకు మించిన మాహాత్మ్య మేమికలదు ?

55. పడక నుండి లేచినది మొదలు ఇతరదైవములను పూజిం పక తన భర్తనే పూజించు స్త్రీయాజ్ఞలను ప్రావృట్కాలమేఘ ములు శిరసావహించును.

56. తన శీలమును తనకీర్తిని కాపాడుకొనుచు, తనభర్తకు ప్రేమ పూర్వకముగ శుశ్రూష చేయువనితయే నిజమైన ధర్మపత్ని.

57. పరదారలలో దాచుటవలన ప్రయోజనమేమి ? తన బ్రహ్మచర్య నిష్ఠయే స్త్రీ పవిత్రతను కాపాడు ఉత్తమరక్షణ.

58. గుణనిధి యగు పుత్రునికన్నతల్లి ధన్యురాలు. దేవతా ప్రపంచములో నామె కున్నతస్థాన ముండును.

59. మంచి పేరుప్రతిష్ఠలు లేని గృహయజమాని ప్రజలమధ్య కేసరివలె సగర్వముగా నడవగలడా ?

60. గౌరవప్రపత్తులు గల గృహమే మనప్రధాన మైశ్వ ర్యము. గుణవంతులైన సంతతిని బడయుటయే దాని పరమా శయము.

ఏడవ యధ్యాయము

## సంతతి

61. బుద్ధివంతులైన బిడ్డలను కనుటతో సమానమైన గొప్ప సంపద మరొకటి లేదు.

62. కళంకము నెరుగని శీలముగలబిడ్డలుగల తండ్రి వైభవము నేమని వర్ణింపగలము ? ఏడుతరములవరకు నతనికుటుంబము నేపాపములు నంటవు.

63. బిడ్డలే తండ్రియొక్క నిజధనము. ఏలన వారి కర్మల ద్వారా వారు సంపాదించు పుణ్యమంతయు తండ్రికే చెందును.

64. సుకుమార గాత్రులగు ప్రియపుత్రికలు తమ చేతులతో ప్రేమపూర్వకముగ ప్రసాదించు గంజియే యమృతముకంటె మధురమైనది.

65. పుత్రగాత్ర పరిష్వంగ సుఖముతో తుల్యమైన దేది కలదు ? పుత్రుల సంభాషణముల నాలకించుటయే చెవులకు పండుగ.

66. వీణె, చితారు మొదలైనవి చెవుల కెంతయో సుఖము నిచ్చునని తమ పసికందుల ముద్దుపలుకుల ననుభవింపనివారే చెప్పుచుందురు.

67. తండ్రి తనపుత్రుని పట్ల ఆచరించవలసిన ధర్మమేది ? పుత్రుడు ' భూపసభాంతరాళమున బుధ్ధుల వాక్పతురత్వము '

కలిగి యగ్రస్థానము పొందగలుగునట్లు చేయుటయే యతని ధర్మము.

68. జ్ఞానసంపదచేత పుత్రుడు తనను జయింపవలెననియే ప్రతితండ్రి కోరుకొనును.

69. పుత్రుడు పుట్టినపుడు తల్లి కపరిమితానందము కలుగును. కాని యా పుత్రుడు గుణవంతు డనిపించుకొనినపుడామె సంతోషము మరింత వరదలుకట్టును.

70. కుమారుడు తండ్రిపట్ల నెరవేర్చవలసిన ధర్మమేమి? 'ఆహా? ఎట్టితపం బొనరించి యిట్టి పుత్రరత్నమును బడయ గలిగెనోకదా!' అని ప్రపంచము విస్మయపడునట్లు చేయుటయే పుత్రుని ధర్మము.

## ఎనిమిదవ యధ్యాయము

# ప్రేమ

71. ప్రేమద్వారములను మూసివేయుగల గడియ యెందైన కలదా? ప్రియులనేత్రముల ననివార్యముగ కప్పివేయు బాష్పాంబు కణజాలమే దానిని ప్రపంచమునకు చాటుచుండును.

72. ప్రేమింపలేనివారు స్వార్థజీవులు. ఇక ప్రేమింప గల వారో! వారు పరహితార్థమై తమ యెముకలను కూడ సమర్పింతురు.

73. ఆహా! వినలేదో! ప్రేమామృతమును తిరిగి రుచి చూడవలయునను కోరిక చేతనే 'ఆత్మ' ఈ యస్థిపంజరములో బంధింపబడుట కంగీకరించెనని యే పెద్దలు చెప్పుదురు.

74. ప్రేమరసాయనము హృదయము నందరి యెడల లలిత మగునట్లు చేయును. హృదయలాలిత్యము మిత్రత్వ మను సమూల్యనిధిని ప్రసాదించును.

75. ధన్యపురుషు లనుభవించు యాశీస్సులన్నియు పూర్వ జన్మలో వారికిగల ప్రేమ స్వభావమునకు మెచ్చి దేవతలు వారికర్పించిన ఫలమే యని పెద్దలు చెప్పుదురు.

76. ప్రేమ ధర్మాత్ములైనవారికొరకే యనుకొనువారు మూర్ఖులు. దుష్టబుద్ధులను జయించుటకు కూడ ప్రేమ యొక్కటే మానవునకుగల మిత్రము.

77. ఎముకలేని క్రిమిని సూర్యుడు కాల్చివేయునట్లు ప్రేమ లేనివానిని ధర్మము దహించివేయును.

78. ఎడారిలో బెరడులేనిచెట్టు పుష్పించినపుడే ప్రేమ నెరు గని హృదయముగల పురుషుడు భాగ్యశాలి కాగలడు.

79. ఆత్మాలంకరణమైన ప్రేమ లేనపుడు బాహ్యాకార మెంత మనోహరముగ నున్నను ఫలమేమి?

80. ప్రేమయే జీవితమునకు మూలము. అదిలేని మానవుడు చర్మకవచము తొడగిన యెముకలగూడు.

## తొమ్మిదవ యధ్యాయము

# అతిథి సత్కారము

81. బుద్ధివంతు లెందుకు శ్రమింతురు? వారు గృహములను దేనికొరకు నిర్వహింతురు? అతిథుల సన్నపానములతో తనిపి సత్కరించుటకు, తీర్థవాసులను సేవించుటకు.

82. అతిథి నీప్రాంగణములో నున్నపు డమృతమునైన నీవొంటరిగ ననుభవింపరాదు.

83. వచ్చిన యతిథిని సత్కరించుట కెన్నడు వెనుదీయని గృహమేధి కేచేటు వాటిల్లగలదు?

84. దరహసిత కాంతితో నతిథిపూజచేసిన గృహమేధి గృహములో లక్ష్మియే కాపురముచేయును.

85. మొదట నతిథి యభ్యాగతులను పూజించి వారు తినిన తిరువాత మిగిలిన విఘసాశనమునే భుజించు గృహయజమాని మాన్యక్షేత్రములతో విత్తనములను విత్తవలసిన యవసర ముండునా?

86. వచ్చిన యతిథి నాతిథ్యముతో తనిపి సాగనంపి రాను న్నవారి కొరకెదురుచూచు అనఘాత్ముడు దేవతలకే యతిథి యగుచున్నాడు.

87. 'ఈ కార్యమున కింతఫలముకలదు' అని మన మే యాతిథ్యకర్మను గురించియు చెప్పజాలము. అతిథి మహానీయతయే మన త్యాగమునకు ప్రమాణము.

88. అతిథి యభ్యాగతుల కర్చనసేయని యభాగ్యుడు "నేనష్టకష్టములు అనుభవించి వేనకువేలు సంపాదించితిని. కాని యదియంతయు నేడు నాకు నిరర్థకమయ్యెను. నన్నిపుడు సుఖపెట్టు వాడొక్కడు కానరాడు" అని విలపించు దినము రాక తప్పదు.

89. ధనధాన్యము లుండియు తీర్థవాసు లేతెంచినపుడు అట్టివారిని సత్కరింపనివాడే నిజమైన దరిద్రుడు. అట్టివారు మూర్ఖులే యగుదురు.

90. 'అనిచ' యను పుష్పము (ఇది యతి సుకుమారమైనది.) మూర్కొని నపుడే వాడిపోవును. కాని యతిథి హృదయమును వ్రక్కలు చేయుటకు నీదృష్టియే చాలును.

పదియవ యధ్యాయము

## దయార్ద్ర వచనము

91. కపట మావంతయులేక మృదు మధురముగ పలుకు ధర్మపరుని సరసవాక్య సరణియే దయగల వాక్కు అనబడును.

92. ఉదార దాతృత్వముకంటె కూడ మృదు వాక్కు, దయార్ద్రమైన ప్రసన్న దృక్కు శ్రేయస్కరములు.

93. హృదంతరాళమునుండి వెలువడు దయారస వాణి, చల్లని చూపు ధర్మని కేతనములు.

94. వచ్చినవానితో మనసిచ్చి సదా మృదుమధురముగనే మాట్లాడువానిని దుఃఖముల నినుమడింపజేయు దారిద్ర్యము చేరజాలదు.

95. వినయము, ప్రేముడిగల సంభాషణమే మానవున కలంకారములు. తక్కినవి మృషాలంకారములు.

96. నీ వాణి దయగలదై, నీభావములు మంచివైనచో పాపము క్షీణించును; ధర్మము అభివృద్ధి చెందును.

97. ప్రయోజనము, దయ గలవాణి; స్నేహితులను సృష్టించును, లాభము కలుగజేయును.

98. పైశాచ్యతయులేని దయగల వాక్కు యిహపరము లందుకూడ మంచినే కలుగజేయును.

99. చల్లని మాటలవలన కలుగు సుఖము ననుభవించు చుండియు మానవుడు పరుషవాక్యముల నెట్లుపయోగించునో తెలియకున్నది.

100. తియ్యని పలుకు లుపకరించుచుండ కఠిన పదములనే ప్రయోగించు మానవుడు స్వాదు ఫలములను విడిచి పుల్ల కాయల నేరుకొనునట్లుండును.

పదకొండవ యధ్యాయము

# కృతజ్ఞత

101. ఫలాశలేక చేయు యుపకారముయొక్క ఋణ మును భూలోక స్వర్గలోకములు రెండును తీర్చుకొనజాలవు.

102. అక్కరపాటు కలకాలమున చేసిన యుపకారము చిన్నదగనే కాన్పించవచ్చును! కాని యది యీ ప్రపంచము నంతను మించినదిసుమా!

103. ప్రత్యుపకార చింతలేక చేయు యుపకారము ముందు సముద్రమే పల్వాల మగును.

104. నీవు పొందు లాభము చిన్న జొన్నగింజంతయే యుండుగాక! కాని రసజ్ఞుల దృష్టిలో నది తాళవృక్ష ప్రమాణము.

105. కార్యప్రమాణమునుబట్టి కృతజ్ఞతకు విలువకట్టరాదు. ఆ లబ్ధిపొందినవాని యుదారతయే దానికి ప్రమాణము.

106. పవిత్రపురుషుల స్నేహము నెన్నడు మరువకుము. నిన్నాపదలో కాపాడినవారి నెన్నడు విడనాడకుము.

107. తమయవసరములలో తమ్ము కాపాడినవారిని గుణ వంతు డేడుతరములవరకు కృతజ్ఞతతో స్మరించుచుండును.

108. చేసినమేలు మరచిపోవుట నీచకార్యము. కాని పొందిన యుపకారము నా నిముసమందే మరచిపోవుట యుదారతలో నొక భాగము.

109. అపకారివలన పొందిన యిసుమంత మేలు తలచినను నతని ఘోరాపచారము క్షమింపబడును.

110. మానవులుచేయు ప్రతి యితర దోషమునకు పరిహారము కలదు. కాని కృతఘ్నతాదోషి 'శవమును కుక్కలైననూ ముట్టుకొనవు.'

## పన్నెండవ యధ్యాయము

# హృదయ పవిత్రత

111. ఔచిత్యమే పవిత్రజీవితమునకు 'ఓ-న-మ' వంటిది. ఔచితి యననేమి? శ్రోత్రవాడు, స్నేహితుడు, విరోధి-ఈయుందరిని వారికర్హమైన విధముగ నీవు చూడవలెననియే యర్థము.

112. న్యాయవంతుల సంపద క్షీణింపదు. అది తరతరముల వరకు నిలిచియుండును.

113. ధర్మపథము వీడుచో లాభమే ప్రాప్తించు నప్పటికి నట్టి లాభమును ముట్టరాదు.

114. పుణ్యాత్ము లెవరో కాని వారెవరో వారి సంతతియే తెలియబరచును.

115. కష్టసుఖములు, మంచిచెడ్డలు అందరకు సమముగనే సంభవించు చుండును. కాని పవిత్రులైనవారి హృదయ సంపద వారు పండించుకొనిన పంట.

116. ఎప్పుడు నీహృదయము ధర్మమార్గము వీడి యధర్మ మార్గము పట్టునో యప్పుడు నీవినాశము మూడినట్లు తెలిసి కొనుము.

117. ఈ ప్రపంచము సత్యవంతుల యొక్కయు, పుణ్యాత్ములయొక్కయు దారిద్ర్యమును నిరసింప జాలదు.

118. తక్కెడదండి దానంతటది సూటిగ నుండును. అది వీసము తప్పిపోకుండ న్యాయముగ తూచును. జ్ఞానుల గొప్ప

తనము కూడ నశ్లై యుండవలయును. అది యిటునటు నొంత మాత్రము బెసగరాదు.

119. తన హృదయములో సత్పథము నెంతమాత్రమువీడని వాని నోటనుండి వెలువడు పవిత్రవాణియే న్యాయమైనతీర్పు.

120. తనప్రయోజనముల వంటివే యితరుల ప్రయోజనము లనిభావించు వర్తకుని వర్తకము వృద్ధిచెందును.

పదమూడవ యధ్యాయము

# ఆత్మనిగ్రహము

121. ఆత్మనిగ్రహమే స్వర్గమునకు మార్గము. వశముకాని రాగము తుద మొదలులేని యంధకారమునకు రాచబాట యగును.

122. నీ యాత్మనిగ్రహము నొక యమూల్య నిధివలె రక్షించుకొనుము. దానిని మించినయైశ్వర్య మీపృథ్విమీద మరియొకటి లేదు.

123. ఈ ప్రపంచవిషయముల యథార్థవిలువలను గుర్తించి నిగ్రహాజీవితమును గడపువానికి జ్ఞానము, దానితోపాటు తదితర యాశీస్సులు చేకూరును.

124. తనరాగములను జయించి, ధర్మమును.డి తొలగక యుండువాని రూపము పర్వతమునకు గూడ నుండజాలదు.

125. వినయము సమస్తజనులకును అలంకారము. కాని యైశ్వర్యవంతులకే యది యున్నచో దానిశోభ యనుపమానము.

126. కూర్మము తన యవయవములను లోపలకు లాగుకొనునట్లు విషయములనుండి పంచేంద్రియములను మరలించి జితేంద్రియుడైనవాడు జన్మాంతరములవరకు నిలిచియుండు నిధిని సేకరించినవా డగును.

127. దేనిని జయింపలేకపోయినను నాలుకను కట్టిపెట్టుము. ఏలన కళ్ళెము బిగింపని నాలుక యవాకులు చవాకులు ప్రేలుచు, నీకు తీరనిదుఃఖము తెచ్చిపెట్టును.

128. నీపలుకొక్కటి యితరులకు బాధకలిగించినను నీగుణ మంతయు నష్టమగును.

129. కాలినపుండు కొంతకాలమునకదియే తగ్గిపోవును. కాని మాటలవలన కలుగుపుండు కలకాలము పచ్చిగనేయుండును.

130. జ్ఞానము సముపార్జించి, నిగ్రహముకలిగించి, కోపమునకెంతమాత్ర మెడ నెడయీనివానిని దర్శించుటకు ధర్మదేవతయే ప్రయాణించి వచ్చును.

పదునాల్గవ యధ్యాయము

## సత్ప్రవర్తన

131. సత్ప్రవర్తన కలవారి నందరు గౌరవింతురు. కనుక జీవితముకంటె కూడ సత్ప్రవర్తనమే విలువమైనది.

132. నీ ప్రవర్తనను అతిమెలకువతో కాపాడుకొనుము ఏలన నీ వెందువెతకినను సత్ప్రవర్తనను మించిన స్థిరమిత్రుడింకొకడు లేడు.

133. పవిత్రజీవితము కులీనతను సూచించును. కాని దుష్ట ప్రవర్తన మానవుని దుర్వినీతులలో జేర్చును.

134. విస్మరించిన వేదములను కూడ తిరిగి వల్లెవేయ వచ్చును. కాని యొకసారి భ్రష్టుడైన బ్రాహ్మణునకిక శాశ్వత పతనమేగతి.

135. ఈర్ష్యాళువు లెన్నడు వృద్ధిచెందరు. అట్లే దుష్ట వర్తకు లెన్నడు గౌరవభాగ్యము ననుభవింపలేరు.

136. ధర్మపతనమువలన కలుగు చెడుగు నెరుంగుదురు కనుక స్థిరచిత్తులు ధర్మపథమును వీడరు.

137. ధర్మప్రవర్తన కలవారిని మానవులు గౌరవింతురు. కాని దానినుండి పతితులైనవారి కపకీర్తియే శరణ్యము.

138. పవిత్రజీవిత మైశ్వర్యమునకు బీజము. దుష్టప్రవర్తన సమస్తపాపములకు మాతృక.

139. ఎంత యాగ్రతగ నున్నను సుశిక్షితుల పెదవుల నుండి తుచ్ఛపదము లెన్నడు గావు.

140. మూర్ఖులకు నీ వెంతవిద్య కఱపినను కఱపవచ్చును. కాని వారెన్నడు ధర్మమార్గానుసారముగ నడచుటకు ప్రయత్నింపరు.

పదునేనవ యధ్యాయము

# పరభామల నపేక్షింపకుండుట

141. ధర్మము, ఐశ్వర్యము కాంక్షించువాడెవ్వడు నితరుల స్త్రీల నపేక్షించుదోషమున కొడిగట్టడు.

142. ధర్మపథ భ్రష్టులైనవా రందరిలో పరకాంత నన్వేషించు వానిని మించిన యవివేకి యింకొకడు లేడు.

143. సంశయము నెరుగని మిత్రుని గృహమునకే 'యెసరు పెట్టువాడు' మృత్యువదనమున తలదూర్చినవా డగును.

144. ఎంత గొప్పవాడైన నేమి? వ్యభిచరించుటవలన కలుగు తలవంపుల నావంతయు గుర్తింపక అట్లుచేయువాని గొప్పతనమంతయు బూడిదలో పోసిన పన్నీరు నంటిదేయగును.

145. అందుబాటులో నున్నదని పరభార్యచుట్టు తిరుగు చుండువానిపేరు కలకాలము కళంకపంకిలము కాకతప్పదు.

146. ద్వేషము, పాపము, భయము, అవమానము—ఈ నాల్గింటివలన వ్యభిచారి నరకబాధ ననుభవింపక తప్పదు.

147. పరభామల సౌందర్యముచే నాకర్షింపబడని హృదయము కలవాడే ధర్మయుతుడైన గృహమేధి.

148. పరభార్యను కన్నెత్తిచూడని యున్నతాత్మకలవాడు ధర్మపరుడే కాక ఋషి సత్తముడుకూడ.

149. సమస్త ప్రపంచ శుభములకు సర్హుడైన వాడెవడు? పరభార్యాకరావలంబనము చేయనివాడే దానికర్హుడు.

150. నీవు ప్రతియితర పాపమునకు లొంగిపోయినను అధమము వ్యభిచారదోషమునైనను చేయకుము. అట్టి నిషేధమే నీకు కీర్తి తెచ్చును.

పదునారవ యధ్యాయము

## క్షమ

151. భూదేవి తనగర్భమును కుళ్ళగించు వారినికూడ భరించుచున్నది. అట్లే నీకపకృతి చేయువారినికూడ నీవు సహింపవలెను; అదియే గొప్పతనము.

152. ఇతరులు నీకుచేయు నపకారముల నెల్లప్పుడు క్షమింపుము. కాని నీవు వానిని మరచిపోవుట మరింత శ్రేయస్కరమైనది.

153. అతిథిసత్కారము చేయకుండు టతిహేయమైన దారిద్ర్యము. మూర్ఖుల బుద్ధిమాంద్యతపట్ల సహనము చూపుటత్యంత సత్త్వలక్షణము.

154. సదా యుదారధర్మమునే యవలంబింపగోరుదువేని యితరుల యవినయముల నోర్పుతో సహింప నేర్చుకొనుము.

155. దెబ్బకు దెబ్బకొట్టు వారిని గురించి బుద్ధివంతులు ఘనముగా తలంపరు. కాని పగతుని క్షమించువారు కేవలము మేలిమి వంటివారు.

156. పగతీర్చుకొనిన సంతోష మొక్కదినము మాత్రమే యుండును. కాని క్షమించినవాని కీర్తి కలకాలము నిలిచి పోవును.

157. పొందిన బాధ యెంతగొప్పదైనను కానిమ్ము! దానిని పరిగణింపక పగదీర్చుకొనకుండుటయే గొప్పలక్షణము.

158. గర్వాంధులై నీకపకారముచేసినవారిని నీ యుదారతచే జయింపుము.

159. తమ్ము దూషించువారి దుష్టజిహ్వను సహించువారు సన్న్యాసుల కంటె కూడ నెక్కువ పవిత్రులు.

160. ఉపవాసాది వ్రతచర్యలు సేయువారు గొప్పవారే! కాని తమ్ము దూషించువారిని క్షమించు వారి తరువాతనే వీరు పరిగణింపబడుదురు.

పదునేడవ యధ్యాయము

# అ న సూ య

161. నీ హృదయములో నసూయయావంతయు లేనపుడే యది ధర్మమునైపు మునుసూపుచున్నట్లు గ్రహింపుము.

162. సమస్త యీర్ష్యాప్రపంచమునుండియు ముక్తిపొందిన ప్రకృతిని మించిన యాశీస్సు లీలోకములో లేవు.

163. పుణ్యాపాపములను, ఐశ్వర్యమును లక్ష్యముచేయని వాడే ప్రక్కవాని యైశ్వర్యమునకు సంతోషించుటకు బదులు అసూయాగ్రస్తుడగును.

164. ఈర్ష్యకులోంగి బుద్ధివంతు లెవరికి నపకారము చేయరు. ఏలన నట్టి నీచభావముచే కలుగు దుష్ఫలితములను వారెరుగుదురు.

165. అసూయయే యసూయాగ్రస్తుని కాల్చివేయు కొరివి. ఆతని శత్రువు లతనిని క్షమించినను తన యసూయయే యతని వినాశమును తెచ్చి పెట్టును.

166. పరులసంపదలను చూడలేని వాని కుటుంబము తిండికి గుడ్డకు కూడ ముఖమువాచి తుదకు నశించును.

167. లక్ష్మి యసహనపరులను సహింపదు. ఆమె వారి పక్షమును వీడి వారిని తన యప్పగారగు పెద్దమ్మకు అప్పగించును.

168. అసూయారక్కసి దారిద్ర్యమును తెచ్చిపెట్టి నరక ద్వారములవరకు త్రోవచూపును.

169. ఈర్ష్యాళువుల కైశ్వర్య మెత్తుట, యుదారమనస్కులు దుఃఖపడుట: ఆశ్చర్యపడవలసిన విషయములు.

170. అసూయ యైశ్వర్యము నెన్నడు ప్రసాదించి యుండ లేదు. ఉదారహృదయమువలన నది యెన్నడు పతనము చెందలేదు.

పదునెనిమిదవ యధ్యాయము.

## పరధనము నాశింపకపోవుట

171. ఇతరుని ధనము నాశించు దుర్నీతుని క్రూరత్వమంత కంతకతిశయించును. చివరకతని కుటుంబము జీర్ణమైపోవును.

172. పాపపరాఙ్ముఖులగు వారు పరుల ధనము నాశింపరు. వారు నీచకార్యముల కొడిగట్టరు.

173. పరలోక సౌఖ్యము వాంఛించువా రల్పసంతోష ముల వెంటబడరు. పాపముల నాచరింపరు.

174. తాము యింద్రియములను జయించి, తమ బుద్ధిని వికసింపజేసికొనిన వారు "మేము దరిద్రులము" అని విలపింపరు; ధనలుబ్ధులు కారు.

175. పేరాసకు లోనై యవివేక కార్యముల కొడంబడు బుద్ధి యెంతసూక్ష్మమైన దైననేమి? ఎంతటిగ్రహణశక్తి కలిగినదైననేమి?

176. భగవంతుని యందు తృష్ణ, సన్మార్గము కలవాడైనను ధనలుబ్ధుడై కుట్రలు పన్నువాడు నశించును.

177. దురాశచే పోగుచేయబడిన ధనము నాశింపకుము. ఫలము ననుభవించు దినము వచ్చునాడు దాని ఫలితము కటువుగనే యుండును.

178. నీవిత్తము తరుగకూడదని నీవు తలంచెదవేని నీప్రక్కవాని ధనమున కాశపడకుము.

179. న్యాయవంతుడై పరధనము నాశింపనివాని విలువ గ్రహించి లక్ష్మి తనంతతానే యతని పజ్జకు చేరును.

180. పరధనము చూడని దురాశ వినాశకారి. కాని, "నాకే కోరికలు లేవు" అను గొప్పతనము సమస్తమును జయించును.

పందొమ్మిదవ యధ్యాయము

# అపైశునము

181. పాపము నాచరించుచు పుణ్యము నాచరింపకపోగా నోటితో నుచ్చరింపనైన నుచ్చరింపనివాడైనను 'ఇతడు చాడీలకోరుకాడు' అని ప్రజలు చెప్పుకొనుచో నదియైనను కొంతమేలే.

182. మంచినివిడిచి చెడ్డచేయుట పాపమే. కాని ఎదుట ముసిముసి నవ్వులు నవ్వుచు వెనుకనుండి నేరములుచాటుట మరింత దౌర్భాగ్యపుపని.

183. అబద్ధములు చెప్పుచు చాడీలు చాటుచు జీవించుట కంటె వెంటనే చనిపోవుటమేలు. అట్టిచావువలన ధర్మము నాచరించుటవలన కలుగు సత్ఫలితము చేకూరును.

184. నీయెదుటనే నిన్ను నవమానపరచినవానిమీద కూడ వెనుకనుండి చాడీలు చెప్పకుము.

185. పెదవులు ధర్మోపన్యాసము చేయవచ్చును. కాని చాడీలు చెప్పునాలుక హృదయముయొక్క నీచత్వమునే వెల్లడి చేయును.

186. నీ యితరులనుగురించి చాడీలు చెప్పుచో వారూరు కొందురా? వారు నీ యవకతవకలను పూర్తిగా తెలిసికొని నీలోని యధమాధమగుణములను బయలుపెట్టుదురు.

187. చాడీలు చెప్పుటలో ఆనందించువారు స్నేహితులను చేసికొనగల మధురకళ నెరుంగలేరు. కనుక నట్టివారు చివరకు తమ ప్రాత స్నేహితులనుకూడ పోగొట్టుకొందురు.

188. తమ మిత్రుల తప్పిదములనే బహిరంగముగ చాటుట నానందించువారు తమశత్రువుల తప్పిదముల నెట్లు క్షమింపగలరు?

189. తన ధర్మనిర్వహణ మనుదాని సహాయముచేతనే కదా భూదేవి చాడీలకోరుల భారమును మోయుచున్నది.

190. పరుల నేరసులను వెతకునట్లు తమ దోషములను పరీక్షించుకొనువారి కెన్నడైన చేటు చేకూరునా?

ఇరువదియవ యధ్యాయము

## వృ థా జ ల్ప ము క ట్టి పె ట్టు ము

191. వ్యర్థపదములను ప్రయోగించి తన శ్రోతలకు కోపము తెప్పించువారి నందరు దూషింతురు.

192. తన స్నేహితుల కపకారముచేయుట కంటె కూడ బహుజనులమధ్య వ్యర్థపదముల నుపయోగించుట మరింత యధ్వాన్నము.

193. శుష్కపదజాలమును విచ్చలవిడిగ ప్రయోగించు వాడు తన యవ్యక్తతనే ప్రకటించుకొనును.

194. సభలో వ్యర్థపదముల నుపయోగించు వాని కే లాభము కలుగదు సరికదా దానివలన యతని పక్షమునగల మంచికూడ పలాయనమగును.

195. యోగ్యులైనను వ్యర్థముగ మాట్లాడువారు తమ గౌరవమర్యాదలను పోగొట్టుకొనెదరు.

196. శుష్కపదములను ప్రేమించువానిని మానవుడని పిలువకుము. అట్టివానిని మానవులలో చెత్తయని పిలువదగును.

197. అవసరమని తోచినచో జ్ఞానులు కఠినపదముల నుపయోగించిన నుపయోగింతురుగాక. కాని వారుకూడ నిరర్థక సంభాషణ చేయకుండుట మేలు.

198. గొప్ప సమస్యలను పరిష్కరించు భావాంబుధిలో మగ్నులైన జ్ఞానులు గంభీరార్థము లేని పదములను వాడనే వాడరు.

199. పవిత్రదృష్టి కలవారు ప్రమాదవశమున నైనను వ్యర్థ పదముల నుపయోగింపరు.

200. మాటలాడదగిన మాటలను మాత్రమే మాటలాడుము. అర్థము లేని వ్యర్థవాక్యముల నెన్నడు పలుకకుము.

ఇరువదియొకటవ యధ్యాయము

# చెట్ట చేయు భయపడుము

201. పాపదోషమునకు దుష్టులు భయపడరు. కాని యోగ్యులైనవారు దానినుండి పారిపోవుదురు.

202. పాపము పాపమునే ప్రభవింప జేయును. కనుక నిప్పు కంటెకూడ పాపమే యెక్కువ భయంకర మైనది.

203. శత్రువుకు కూడ అపకారము చేయకుండుటే జ్ఞానములలోనికెల్ల నుత్తమజ్ఞానమని పెద్దలు చెప్పుదురు.

204. అనాలోచితముగ నైనను మానవుడితరుని నాశనము తెచ్చిపెట్టకుండును గాక. ఏలన న్యాయదేవత దుర్మార్గము పన్ను దుష్టుని నాశనముచేయును.

205. 'నేను బీదవాడను' అను నెపముతో మానవుడు దుర్మార్గము చేయరాదు. అతడట్లు చేయుచో పూర్వముకంటె కూడ మరింత దరిద్రుడగును.

206. పాపములచే దుఃఖింప నిచ్ఛగింపనివా డితరులకపకారము చేయకుండ నుండవలయును.

207. ఇతరశత్రువులనుండి తప్పించుకొనుట కుపాయములు కలవు. కాని పాపకార్యము లెన్నడు నశింపవు. అవి యాపాతకుని వెంటాడించి నాశము చేయును.

208. మానవునితో నడచుచుండు నీడవలె పాపములు పాపి వెంటబడి యతనిని నాశము చేయును.

209. తనను ప్రేమించుకొను వాడు పాపము నైపు కాపం తయు మొగ్గరాదు.

210. పాపము చేయుటకు సరళమార్గమును విడిచిపెట్టని మానవుడే చెరుగులనుండి ముక్తిపొందగలడని తెలిసికొనుము.

## ఇరువది రెండవ యాధ్యాయము

## ఉపకార బుద్ధి

211. ఉదారచరితులు ప్రతిఫలము కోరకనే యుపకారము చేసెదరు. ప్రపంచ మెన్నడైన జలదముల ఋణము తీర్చుకొన గలదా ?

212. యోగ్యులైనవారు కష్టించి సంపాదించు విత్తమంతయు నితరుల కొరకేగాని తమకొరకు కాదే !

213. ఇహలోకమున లోగాని పరలోకములోగాని యుదారతతో చేయు నుపకారమును మించిన గొప్పవస్తువేదియు లేదు.

214. ఉచితమైన దానిని గ్రహించినవాడొక్కడే జీవించువాడనదగును. ఔచిత్యము నెరుగనివాడు మృతిచెందిన వారిలో జేరును.

215. ప్రపంచమును ప్రేమించు బుద్ధివంతుని యైశ్వర్యము అంచుల వరకు నిండియుండు గ్రామలో టాన్ జలసంపద వంటిది.

216. దయారసము గలవాని యైశ్వర్యము గ్రామమధ్యమున ఫలసమృద్ధితో నలరారు వృక్షసంపద వంటిది.

217. పరహితార్థపరుని చేతిలోనుండు ఐశ్వర్యము అంగరకు నందుబాటులో నుండి వైద్యమున కుపకరించు మూలికలను ప్రసాదించు వృక్షరాజము వంటిది.

218. న్యాయమును, ఔచిత్యమును గ్రహించినవారు చెడ్డ రోజులు సంభవించినను పరహితార్థము చేయకుండజాలరు.

219. పరహితార్థపరుడు అర్థివానికిచ్చుటకు లేనపుడే తాను దరిద్రుడైనట్లు భావించును.

220. ఔపకారిక గుణము వలననే నాశము తటస్థించునేని తనను దాస్యమునకు విక్రయించుకొని యైనను దానిని నిలుపు కొనుటే మేలు.

ఇరువదిమూడవ యధ్యాయము

## దాతృత్వము

221. బీదలకిచ్చు దొక్కటియే దానమనబడును. తక్కిన దానములన్నియు అప్పిచ్చుట వంటివి.

222. దానము పట్టుట స్వర్గమునకు మార్గమైనను మంచిది కాదు. దాతకు స్వర్గము నిరాకరింప బడినను దానముచేయుట యుత్తమోత్తమగుణము.

223. కులీనుడొక్కడే 'నాకులేదు' అని యెన్నడు నీచముగా విలపింపక దానము చేయగలడు.

224. సంతృప్త హృదయుడైన యర్థిముఖమువీద చిరునగవు కన్పించువరకు దాత హృదయము చిగునవ్వుతో పల్లవింప జాలదు.

225. ఆకలిని జయించుటే యాత్మవిజయము సాధించినవాని జయముల లోనికెల్ల నుత్తమ విజయము, కాని తనను తాను జయించినవాడే యాకలి నుపశమింప జేసికొనగలడు.

226. దుర్దినములలో బీదవానికడుపు చిచ్చుచల్లార్చుట కొరకే యైశ్వర్యవంతుడు నిలువచేసి యుంచవలెను.

227. తనకున్నదాని నితరులతో పంచుకొని తినువాని నాకలియను పెనుభూతమెన్నటికి కన్నెత్తి చూడజాలదు.

228. తమ ధనమును బొక్కసములలో నింపి నశింపజేయు కఠినాత్ములితరులకు దానముచేయుట వలన కలుగు ఆనందము నెన్నడు ననుభవించియుండ లేదా ?

229. తిరిపెమెత్తితిను తిరిపెగాని ముష్టితిండికంటె తన యుదరమునే నింపుకొనుచు కుక్కుకొని తిను పిశినిగొట్టు ముష్టాన్నమే మరింత యేహ్యమైనది.

230. మృత్యువును మించిన మహానర్థ మింకొకటి లేదు. కాని యర్థివాని కిడుటకు లేకపోవుటకంటె మృత్యువే మధురమైనది సుమా !

## ఇరువదినాల్గవ యధ్యాయము

# యశస్సు

231. బీదసాదలకు దానము చేయుచు నీపేరు ప్రతిష్ఠలను పెంపుచేసికొనుము. మానవున కింతకంటె నెక్కువ లాభదాయకమైనది వేరొకటి లేదు.

232. బీదసాదలకు చేయు దానధర్మములే కవి, గాయకుల స్తోత్రముల కర్హమైన యేకైక విషయములు.

233. ఈ పృథ్విమీద సమస్తము నశించిపోవును. కాని మానవ చరిత్రలో నెవరి విజయము లనుపమానములో అట్టి యుదారచరితుల కీర్తిమాత్రము శాశ్వతముగ నిలిచిపోవును.

234. శాశ్వతముగనుండు జగద్విఖ్యాతిని గాంచినవారినే దేవతలు ఋషులకంటెకూడ నధికముగ గౌరవింతురు.

235. కీర్తిని పెంపొందింపజేయు నాశము, ప్రభావమును ప్రసాదించు మృత్యువు మహాత్ములకు దప్ప మరెవ్వరికి లభింపగలదు?

236. ఈప్రపంచములో నుద్భవించినందులకు పేరు ప్రతిష్ఠలు సంపాదించుటే పురుషలక్షణము. అట్టివానిని సంపాదింపజాలని వ్యర్థులు పుట్టకుండుటయే మేలు.

237. మానవులు తము కళంకిత జీవితములకు తమ్ము తామసహ్యించుకొనరు సరికదా దానిని బయటపెట్టువారిపై క్రుద్ధులగుదు రేలకో తెలియకున్నది.

238. మానవులు కీర్తియను జ్ఞప్తిని గడింపరేని యది వారికి తీరని కళంకము.

239. దుర్నీతులైన ప్రజల పరతాడనములచే క్రుంగు దేశ మెుకప్పు డెంతటిమైశ్వర్యము ననుభవించినను గర్భదారిద్ర్యము ననుభవింపక తప్పదు.

240. మచ్చలేకుండ జీవించువారే జీవించువారనదగుదురు. కీర్తిలేకుండ జీవించువా రొక్కరే మరణింతురు.

గృహస్థజీవితము అను శీర్షిక గలప్రథమ
భాగములోని ప్రథమ ప్రకరణము
సమాప్తము.

---

# రెండవ ప్రకరణము



సన్యాసియొక్క జీవితము

ప్రథమ విభాగము — శిక్షణ

ఇరువదిమొదవ యధ్యాయము

## దయ

241. దయారసముతో నుప్పొంగు హృదయమే పరమోత్కృష్ట ద్రవ్యము. ఏలనందువేని వస్తుసంపద దుర్మార్గుల చేతులలో కూడ నుండునుకదా!

242. సన్మార్గము నవలంబింపుము. దయను వరింపుము. ఇతరమతములలోని బోధలను కూడ పరికింతువేని దయ యొక్కటియే మోక్షమని నీవు గ్రహింపగలవు.

243. దయారస సమృద్ధహృదయము రాగద్వేష తమోమయ ప్రపంచములో మగ్నము కాజాలదు.

244. ఆత్మను కంపింపజేయు కర్మఫలితము లెవ్వియు సర్వభూతదయ, ప్రేమ కలవారిని వెన్నంటజాలవు.

245. దయగలవాని కెన్నడు విసుగుదల కలగదు. గంధవహా వలయితమైన భూదేవియే యిట్టి క్షమకు సాక్ష్యము.

246. నిర్దయాత్ముడై పాపమున కొడిగట్టిన వానిని గురించి పెద్దలేమి చెప్పుదురు ? 'దయావిహీనుడై చరించినందుల కితడు గతజన్మలలో శిక్షింపబడినను దానినంతను మరచినాడు' అందురు.

247. ధనములేనివాని కీ ప్రపంచము లేదు. అట్లే దయలేని వానికి పరలోక ముండజాలదు.

248. అర్థసమృద్ధి లేనివారు నేడు కాకిచో రేపైనను రాణింపవచ్చును. కాని జాలిలేని కఠినాత్ముడే నిజమైన దరిద్రుడు. అట్టివాని కెన్నడు శుభదినములు పట్టవు.

249. వికల మనస్కుడు సత్యము నెంత సులభముగ గ్రహింపగలడో అంత సులభముగనే కఠినాత్ముడు ధర్మకార్యములను చేయగలడు.

250. బలహీను నొకని నణచివేయ వలయునను తలంపు నీకు పొడమినపుడు నీకంటె బలవంతునిముందు నీవెట్లు వణకితివో దానిని జ్ఞప్తికి తెచ్చుకొనుము.

ఇరువదియారవ యధ్యాయము

## మాంస నిషేధము

251. తనకండలను పెంచుట కితరజంతువుల మాంసమును భక్షించువా డెట్లు దయకలిగి యుండగలడు ?

252. పొదుపులేనివారి చేతిలో నైశ్వర్య ముండజాలదు. అట్లే మాంసమును భక్షించువాని హృదయములో దయ మృగ్యమగును.

253. చేతిలో ఆయుధమున్నవాని హృదయము మంచికి మరలజాలనట్లు మాంసరుచి చూచినవాని హృదయము కూడ మంచికి మరలదు.

254. జంతువులను జంపుట హృదయ కాఠిన్యతయే. కాని వాని మాంసముతినుట కేవలము పాతకము సుమా!

255. మాంసము తినకుండుటే జీవితము. దానిని తినుటచే నరకకూపము మూసికొనిపోయి నిన్ను బయటకు వెలువడ నీయదు.

256. ప్రపంచము మాంసమునాహారముగా కోరదేని దానిని విక్రయించువా రెవరుందురు.

257. ఇతర ప్రాణికోటి యనుభవించు బాధను క్షోభను మానవుడు గ్రహింప గలిగినచో అతడు మాంసాహారము ముట్టనే ముట్టడు.

258. అజ్ఞానము, భ్రమ యను సంకెళ్ళనుండి ముక్తుడైన వాడు ప్రాణరహితమైన మాంసమును ముట్టడు.

259. యజ్ఞవాటికలమీద వేయి యజ్ఞములు చేయుట కంటె జంతువులను చంపక, మాంసమును భక్షింపక యుండుట మేలు.

260. చంపివేయుటమాని, మాంసము తినుటమానియుండు సుగుణాత్మునకు ప్రపంచము చేయెత్తి జోహారు లిడును.

ఇరువదియేడవ యధ్యాయము

# తపస్సు

261. తపస్సనగా నేమి ? కష్టముల నతిశాంతముగ ననుభవించుట, ఎట్టిజీవికి నపకారము చేయకుండుట- ఈ రెండిటిలోను తపస్సనున దంతయు నిమిడియున్నది.

262. పూర్వజన్మలలో తపస్సుచేసి పుణ్యము నార్జించిన వానికే తపస్సు సాధ్యము కాగలదు. ఇతరులకది లభ్యము కాజాలదు.

263. సన్న్యాసుల కన్నపానములనిచ్చి పోషించుటకు కొంత మంది యుండవలయును. కనుకనే తక్కినవారందరు తపస్సును నిర్లక్ష్యము చేయుచున్నారా ?

264. నీశత్రువులను జయించుట, నిన్ను ప్రేమించువారి నున్నతికి గొంపోవుట — ఈ రెండు శక్తులు తపస్సువలననే సాధ్యమగును.

265. తపస్సు చివరకు నీవు కోరు సకలార్థ సిద్ధులను నీకోరిక ప్రకారమే సిద్ధింపజేయును. కనుకనే మానవు లీప్రపంచకములో తపస్సు కొరకు ప్రయత్నించు చుందురు.

266. తపస్సు చేయువారొక్కరే తమ నిజప్రయోజనములను గుర్తించినవా రనదగుదురు. తక్కినవారు వాంఛావాగు

రులలో జిక్కి తమకు తామే యుపకారము చేసికొనుచున్నారు.

267. బంగారము పుటము పెట్టినకొలది వన్నె తేలుచుం డును. అట్లే తమ తపశ్చర్యలలో బాధలనుభవించినకొలది తాపసుల పవిత్రస్వభావము తేజరిల్లుచుండును.

268. ఆత్మవిజయము సాధించిన ఋషిని లోకమంతయు పూజించును.

269. తపఃకర్మలద్వారా శక్తిని సంపాదించిన వీరులు మృత్యువును కూడ జయింపగలరు.

270. నేడు ప్రపంచములో దరిద్రు లెక్కువగ నుండుటకు కారణమేమి? తపస్సు చేయువారు బహు అరుదుగ నుండు టయు ప్రజలలో నత్యధిక సంఖ్యాకు లట్లు చేయకుండుటయు దీనికి కారణము.

## ఇరువదియొనిమిదవ యధ్యాయము

# వంచన

271. వంచకుని మోసము చూచి యతని శరీరములోని పృథివ్యాది పంచతత్త్వములే తమలోతాము విరగబడి నవ్వుకొను చుండును.

272. హృదయములో నున్న దుర్మార్గత నొకవంక హృద యము దొలుచుచుండ పైకి మేకపోతు గాంభీర్యము వహించిన నేమిలాభము?

273. ఆత్మవిజయము సాధింపక సన్యాసవేషము మాత్రము ధరించువాడు పెద్దపులిచర్మము కప్పుకొని మేయు గోవువంటి వాడు.

274. మునివేషధారియై చెడ్డపనులు చేయువాడు పొదల చాటున దాగి పక్షులను పట్టుకొను వ్యాధునివంటివాడు.

275. వంచకుడు పవిత్రతను నటించుచు 'నేను నా రాగ ద్వేషములను జయించితిని' అని బుకాయించు చుండును. కాని యతడు చివరకు 'నేనేమి చేసితిని! ఆహా! నేనేమిచేసి తిని?' అని దుఃఖించు దినములు రాగలవు.

276. హృదయములో త్యాగములేక త్యాగివలెనటించుచు మానవులను మోసగించు మోసకారికంటె నీతిదూరుడైన యధమాధము డింకొకడులేడు.

277. గురివిందగింజ పైభాగము మెరుపు; క్రిందిభాగము నలుపు. మానవులలో నిట్టివారు కలరు. వారు పైకి యందముగనే కాన్పింతురు; కాని వారి యాంతర్యము దుర్గంధ పూరితము.

278. అపవిత్ర హృదయులై పవిత్రతోయములలో మునుగుచు తిరుగుచుండు వెర్రిమానవు లెంతముంది లేరు?

279 బాణము వంకరలేక సూటిగ నుండును. కాని యది రక్తముకొరకే పరితపించుచుండును. వీణె వంపుగలిగి యుండును. కాని దానిని ముట్టుకొనుట తోడనే పరిసరముల నంతను

మాధురధ్వనులతో నింపుచుండును. కనుక నీవు ప్రజలను రూప ములనుబట్టికాక వారిచర్యలను బట్టియే నిర్ణయింపుము.

280. ప్రపంచము జేనినిచూచి కంటగించుకొనునో దానిని నీవు వర్జింతువేని జటాధారణములతో గాని ముండనాదులతో గాని పనిలేదు.

ఇరువది తొమ్మిదవ యధ్యాయము

## మోసమును త్యజింపుము

281. మానవగర్హణకు దూరముగ నుండదలంచువాడు మోసము చేయవలెనను భావము నెంతమాత్రము దోహదము చేయకుండునుగాక.

282. 'నా ప్రక్కవాని సొత్తు హరింతునుగాక' అని మన స్సులో ననుకొనుట కూడ మహాపాపము.

283. మోసముచే ప్రోగుచేయబడిన యైశ్వర్యము వర్ధిల్లు చున్నట్లే కనబడవచ్చును. కాని యది ముమ్మాటికి నశింపక తప్పదు.

284. దోచుకొనవలెననెడు దాహము దానికాలము దాప రింపగనే దరిలేని దుఃఖము తెచ్చిపెట్టును.

285. ఇతరుల ద్రవ్యము నపహరింపవలెనను దుర్బుద్ధితో ప్రజలెప్పు డేమరియుందురాయని పొంచియుండు దురాత్ముని

హృదయములో ప్రేమ దయాదాక్షిణ్యములు సుంతయైనను కానరావు.

286. దోచుకొనవలెననెడి దాహముకల మానవుడు యుక్తాయుక్త విచక్షణతో విషయములను పరిగణింప జాలడు. అతడు ధర్మమార్గమున అసలే నడువజాలడు.

287. ఈప్రపంచవిషయముల సత్తాగ్రహించి తన హృదయమును దృఢపరచినవాడు ప్రక్కవానిని మోసగించు పాపము చేయడు.

288. విషయములను యుక్తముగ గ్రహించువాని హృదయములో ధర్మము ప్రతిష్ఠింపబడునట్లు మోసము దొంగవాని హృదయములో స్థావర మేర్పరచుకొనును.

289. వంచనమీద మోసముమీద తప్ప మరి దేనిమీద ధ్యానము నిలుపనివాడు ధర్మమార్గచ్యుతుడై నశించును.

290. ఇతరులను మోసగించువాడు చివరకు తన శరీరము మీద కూడ ఆధిపత్యము వహింపజాలడు. కాని ధర్మాత్ములు భగవంతుని రాజ్యమునకే నిర్నిరోధ వారసు లగుచున్నారు.

ముప్పదియవ యధ్యాయము

# స త్య స ం ధ త

291. సత్యసంధత యనగా నేమి? ఆవంతయు చెడుగు లేని దానినిగురించి మాట్లాడుటయే సత్యసంధత.

292. అకలంక కళ్యాణము చేకూర్చునేని యనృతముకూడ సత్య స్వభావమునే కలిగియుండును.

293. అనృతమని నీకు తెలిసిన దానిని యథార్థమని నిరూపింపబోకుము. ఏలన నీ వబద్ధమాడు నపుడు నీ యంతరాత్మయే నిన్ను కాల్చివేయును.

294. అనృత లేశమైనను లేనిహృదయముగల మానవుడు అందరి హృదయములలోను రాజ్యముచేయును.

295. సత్యనిరతి గల మానవుడు సన్యాసికంటెను బీదసాదల నాదరించు వదాన్యునికంటెను గొప్పవాడు.

296. అనృతమాడనివా డను కీర్తికంటె గొప్పకీర్తి మానవున కింకొకటి లేదు. అట్టివాడు శరీరమును శుష్కింప జేయ నక్కరలేకయే ప్రతిసుగుణమును సాధింపగలడు.

297. ఎన్నడు నొక యబద్ధమైనను చెప్పనక్కరలేకుండ జీవింపగల మానవున కితరగుణము లన్నియు పశ్చాదుపులగము వంటివి.

298. నీరు బాహ్యరూపమును మాత్రమే శుద్ధిపరచును. కాని సత్యసంధతవలననే హృదయపవిత్రత ఋజువు కాగలదు.

299. సజ్జనుల దృష్టిలో బాహ్య ప్రపంచమున కన్పించు వెలుతురే వెలుతురు కాదు! సత్యజ్యోతియే జ్యోతులలోనికెల్ల జ్యోతియని వారు పరిగణింతురు.

300. నేనీ ప్రపంచములో ననేక వస్తువులను చూచితిని. కాని నేను చూచినవస్తువు లన్నిటిలోను సత్యమును మించిన దింకొకటి లేదు.

## ముప్పదియొకటవ యధ్యాయము

# కోపమును వీడుట

301. క్షమించుట యనగనేమి? కొట్టగలిగియుండియు కొట్టకుండుటే క్షమ యనదగును. శక్తిలేనివాడు క్షమించిన నేమి క్షమింపకుండిన నేమి?

302. కొట్టలేనివాడవైనను కోపమువహించుట తప్పుపని. నిజముగ నీకట్టి శక్తియే యున్నచో కోపముకంటె నీచమైనది వేరొకటి లేదు.

303. నిన్నవమానపరచినవా డెవడైనను కోపమును మరచి పొమ్ము. ఏలన కోపమునుండి యనేక చెడుగు లుద్భవించును.

304. కోపము నవ్వును చంపివేయును. సంతోషమును నాశముచేయును. మానవునకు కోపముకంటె క్రూర శత్రువు మరియొకడు కలడా?

305. నిన్ను గురించియే నీవు శ్రద్ధవహింప గోరుదువేని కోపమును దూరముగ నుంచుము. అట్లు చేయక నీవు దానిని మన్నింతువేని యది నీపై నాక్రమించి నిన్నే నాశముచేయును.

306. కోపముకోపముగల ప్రతివ్యక్తిని నాశముచేయుటయే గాక దానికి చోటిచ్చువాని కుటుంబమునుకూడ దహించివేయును.

307. తనకోపము నొక నిక్షేపమువలె పెంచువాడు తన చేతిని నేలమీదవేసి బాదుకొనువా డగును. అట్టివాని చేయి విరుగకతప్పనట్లు కోపి నశింపక తప్పదు.

308. మంటలు మండునట్లు నీ తప్పులు మండిపోయినను నీవు నీ కోపము నుపశమింప చేసికొనుటయే మేలు.

309. నీ హృదయమునుండి కోపమును పాంద్రోలిన యుత్తర క్షణమందే నీకోరిక లన్నియు నెరవేరును.

310. కోపమునకు లొంగిపోయినవాడు చచ్చినవానితో సమానము. దానిని జయించినవాడు ఋషితుల్యుడు.

ముప్పదిరెండవ యధ్యాయము

# అ హిం స

311. ఇతరులకు హాని చేయుచో రాజ్యమే ప్రాప్తించునప్పటికి పవిత్ర హృదయములట్లు చేయజాలరు.

312. ద్వేషి తనకపకారము చేసినను పవిత్రహృదయుడు ప్రతీకారము దలంపడు.

313. నిష్కారణముగనే నీకొకడపకారము చేసినను నీవు ప్రతీకారము చూపుదువేని చికిత్సలేని చెడుగులను నీకు నీవే తెచ్చికొందువు.

314. మనకపకారము చేసిన వారిని మనమెట్లు శిక్షింపవలెను ? ఉపకారము చేసి వారికి వారే సిగ్గుపడునట్లుచేయవలెను.

315. ఇంకొకప్రాణి యనుభవించు బాధ తన బాధవంటిదే యని, కనుక తానితరు లెవరికి నపకారము చేయరాదని భావింపనివా డెంత బుద్ధిమంతుడైన నేమి లాభము ?

316. ఒరు లేయవి యొనరించిన యప్రియంబు తన మనంబున కగు తానవి యొరులకు చేయకుండ వలెను.

317. ఏమానవుని, యేకాలమున యేమాత్రము కూడ బుద్ధిపూర్వకముగ హింసింప కుండుటయే గొప్పతనము.

318. తాను స్వయముగా బాధను రుచి చూచిన వా డితరుల నెట్లు బాధింపగలడు ?

319. తన ప్రక్కవాని నుదయము బాధించిన వానికి మధ్యాహ్నమగు సరికి బాధ తానంతటదియే సంప్రాప్తించును.

320. ద్రోహి తానుచేసిన పాపమునంతను కుడువక తప్పదు. కనుక చెట్టచేయకుండుటయే చెట్టనుండి తప్పించుకొను మార్గము.

## ముప్పదిమూడవ యధ్యాయము

# చంపకుండుట

321. చంపకపోవుటయే పరమధర్మము; చంపుట చేత దానితో ప్రతియితర పాపము మూటకట్టుకొనక తప్పదు.

322. తనకున్నదానిని దరిద్రులతో పంచుకొనుట, ప్రాణి కోటిని చంపకపోవుట: అందరుప్రవక్తలు బోధించిన విధులలో నీరెండు పరమోత్కృష్ట మైనవి.

323. ప్రాణిని చంపకపోవుటయే యన్నిటికంటె నుత్తమ ధర్మము. సత్యము దానితరువాతవచ్చు రెండవధర్మము.

324. ఏది సన్మార్గ మనఁబడును? అతినికృష్టజీవి ప్రాణమును కూడ రక్షించు మార్గమేని కలదో యదియే సన్మార్గము.

325. గార్హస్థ్య జీవితముకు సంబంధించు పాపములకు వెరచి దానిని విడిచిపెట్టినవా రందరికంటె చంపుటకు భయపడి సర్వప్రాణులను పూజించు వాడే యుత్తముడు.

326. సర్వప్రాణులను దిగమింగు మృత్యువే యహింసా వ్రతునిపై దండయాత్ర చేయుటకు వెరచును.

327. నీప్రాణమును రక్షించుకొనుటకైనను అందరకు తీపియైన ప్రాణమును తీసివేయకుము.

328. యజ్ఞయాగాదులనేక స్వర్గసౌఖ్యముల నొనగూర్చునని చెప్పుదురు. కాని పవిత్రహృదయులనే చంపుటవలన కలుగు సుఖములు తుచ్ఛసుఖములు.

329. ప్రాణికోటిని వధచేసి జీవించువారు చచ్చిన గొడ్డు మాంసము తినునట్టివారని విజ్ఞులు చెప్పుదురు.

330. రసికారు పుళ్ళతోనిండి క్రుళ్ళిన శరీరముతో తిరుగు దీనుడు పూర్వజన్మలో రక్తమును స్రవింప చేసినవాడని పెద్దలు చెప్పుదురు.

ఇందుతో శిక్షయను శీర్షికగల మొదటిభాగము
రెండవ ప్రకరణము మొదటివిభాగము

సమాప్తము.

# రెండవ ప్రకరణము



సన్యాసి జీవితము

రెండవ విభజన — ప్రజ్ఞానము

ముప్పదినాల్గవ యధ్యాయము

## విషయముల నిస్సారత

331. నశ్వరములు శాశ్వతములని భ్రమించుటకంటె గొప్ప తప్పిదము వేరొకటి లేదు.

332. గ్రామములో జరుగు తమాషా చూచుటకొరకు గుంపు చేరుచు దానిని చూచుటతోడనే తిరిగి చెదరిపోవును. అట్టిదే మానవుని యైశ్వర్యము. అదివచ్చి యొకచోట నిలుకడగ నుండక చెదరిపోవుచుండును.

333. ఐశ్వర్యము అనిత్యము. అది నీకు సమకూరునేని శాశ్వత కళ్యాణముచేకూర్చు పనులుచేయుట కెంతమాత్రము నాలసింపకుము.

334. కాలము నిరపాయకరమైనదిగ కన్పించును. యదార్థమున కది మానవజీవితమును నిరంతరము కోయు క్రకచము వంటిది.

335. జిహ్వ స్తంభింపకమునుపే, యెక్కిళ్లు పుట్టకమునుపే సత్కార్యములను చేయుటకు త్వరపడుము.

336. నిన్న నున్న మనిషి యీరోజున లేడే! ఈ ప్రపంచములో నింతకంటె గొప్పవింత యేదికలదు ?

337. మరునిమిషముండునది లేనిది మానవుడు చెప్పజాలడు. కాని యతని యూహలకు పట్టపగ్గములుండవు. అవి యసంఖ్యాకములు.

338. గుడ్డు పగులుటతోడనే పెంకువిడిచి పిల్ల పారిపోవును. దేహి దేహములకు గల సంబంధమింతయే.

339. మృత్యువు ఒక నిద్రవంటిది. జీవితము ఆనిద్దుర తీరినతరువాత మేల్కొనుట వంటిది.

340. ఆత్మకొక స్వంత స్థిరనివాసము లేకపోవుటచేతనే యీతుచ్ఛశరీరములో నొక స్థానముచూచుకొనునా ?

## ముప్పదియైదవ యధ్యాయము

# సన్యాసము

341. మానవు డేవిషయమును త్యజించివేయునో ఆ విషయమూలమున సంభవించు దుఃఖమునుండి కూడ విడివడినవాడగును.

342. ఆనందము ననుభవింప గోరుదువేని ముందుగనే త్యాగము చేయుము. ఏలన నీవు త్యాగముచేసిన తరువాత పొందు సుఖము లనేకములు కలవు.

343. పంచేంద్రియములను జయింపుము. నీ వేయేవిషయము లందు రమించుచుందువో ఆ ప్రతివిషయమును పూర్తిగా పరిత్యజింపుము.

344. బ్రహ్మనిష్ఠ యననేమి ? దేనిని కలిగియుండక పోవుటయే ? చివరకొక్క వస్తువు మిగుల్చుకొనినను మానవుడు తను పన్నుకొనిన వలలో చిక్కినవా డగును.

345. పునర్జన్మ నొల్లనివారికి శరీరముకూడ బరువుచేటు. ఇక తదితరబంధముల సంగతి చెప్పనేల ?

346. 'నేను. నాది' యనుభావములు దంభాహంకారములు తప్ప మరేమియు కావు. వీని నణచివేయ గలవాడు దేవలోకమును దాటి పైలోకమునకు పోవును.

347. బంధనములను త్రెంచుకొనలేక వానిని కౌగిలించుకొనువానిని విచారములు దుఃఖములు విడిచిపెట్టవు.

348. పరిపూర్ణత్యాగులు మోక్షమార్గగాములగుచున్నారు. తక్కినవా రొక వలలో చిక్కినవారే సుమా !

349. ఏక్షణములో బంధనములు తెగిపోవునో ఆక్షణములోనే పునర్జన్మ నశించును. వానిని భేదింపలేనివాడు నిరర్థకముగ ప్రయాణించుచుండును.

350. సర్వబంధములను జయించిన యాపరాత్పరునియందు సంగము కలిగి యతనికే బంధింపబడి యుండుము. ఇతర బంధము లన్నియు తుత్తునియలగునట్లు అతనినే యాశ్లేషించి యుండుము.

ముప్పది యారవ యధ్యాయము

## పరమార్థ జ్ఞానము

351. దంభాదులే పరమార్థమనుకొను భ్రమ ఆత్మను తిరిగి యీదుఃఖమయ ప్రపంచమునకు రప్పించును.

352. భ్రమరహితుడు, వినిర్మల దృష్టికలవాడు అంధకార విముక్తుడై యానందము ననుభవించును.

353. సంశయరహితునకు, పరమార్థము నెరిగినవానికి ఈ భూతలముకంటె స్వర్గమే సన్నిహితముగ నుండును.

354. పరమార్థము గుర్తింపలేని యాత్మ మానవజన్మము నెత్తినప్పటికి సుంతయైనను లబ్ధి పొందజాలదు.

355. ప్రతి విషయముపట్ల, దాని స్వభావ మెట్టిదైనను సత్యమును అసత్యమునుండి వేరు పరచుటయే యుక్తమైన పరిజ్ఞానము.

356. గంభీరపఠితయై, పరమార్థమును జీవితములో చూరగొను వ్యక్తి తిరిగి యీ ప్రపంచమునకు రానక్కరలేని భద్ర మార్గమున నడచును.

357. పరమార్థమును ధ్యానించుచు, దానిని సాధించువారు ముందు జన్మలనుగురించి యెంతమాత్రము భావింపనక్కరలేదు.

358. పూర్ణత్వమును, పరమార్థమును సాధించుటకు యత్నపరుడై, పునర్జన్మ దోషమును తప్పించుకొనువాడే జ్ఞాని.

359. ముక్తి సాధనలను తెలిసికొని సర్వబంధములను నిగ్రహించినవాడు రానున్న దుఃఖములనుండికూడ విముక్తుడగును.

360. కోరిక, కోపము, భ్రమ – ఈ త్రిపుటిని పూర్తిగా జయించినవాడు సకల బాధలనుండి విముక్తుడగును.

ముప్పదియేడవ యధ్యాయము

# కోరికను చంపివేయుట

361. కోరికయే ప్రతిజీవికి నిరంతర జన్మపరంపరలను సమకూర్చు విత్తనము.

362. నీవు దేనినేని కోరుకొనవలసి యున్నచో జన్మరాహిత్యమునే కోరుకొనుము. కాని కోరికను జయింపవలెనని నీవు కోరిననాడే నీకట్టి జన్మరాహిత్యము చేకూరును.

363. ఈ ప్రపంచములో సంకల్పరాహిత్యమును మించిన యైశ్వర్యమేదియు లేదు. స్వర్గములోకూడ దీనితో సమమైన నిధి యేదియు లేదు.

364. పవిత్రత యనగా నేమి? కోరిక లేకుండుటయే పవిత్రత యనబడును. పరిపూర్ణ సత్యమును వాంఛించిన నాడే యాముక్తి సాధ్యమగును.

365. తమ కోరికలను జయించినవారే ముక్తులు. తక్కిన వారు ముక్తులవలె కాన్పింతురు. కాని వారు నిశ్చయముగ బద్ధాత్ములు.

366. నీవు ధర్మతత్పరుడవు కాగోరుదేని కోరికను విడిచి పెట్టుము. ఏలనన కోరికయొక యుచ్చువంటిది. అది నిన్ను వంచించును.

367. మానవుడు కోరికను సంపూర్తిగా నణచివేసినచో నతడేమార్గముననైనను మోక్షము బడయగలడు.

368. కోరికలు లేనివానికి దుఃఖమే లేదు. కాని విషయముల వెంట పరుగిడువానికి కష్టపరంపరలు నిరంతరము వచ్చుచునే యుండును.

369 కోరికయే యన్నిటికంటె నెక్కువదుఃఖము. దానిని చంపివేసినవాడు ఈలోకములో కూడ శాశ్వతానందము ననుభవింప గలడు.

370. కోరిక యెన్నటికి నిండునదికాదు. కాని మానవు డేనిముషమందు పూర్తిగా దానిని త్యజించునో యానిముష మందే పూర్ణత్వమును సంపాదించును.

## ముప్పది యెనిమిదవ యధ్యాయము

# వి ధి

371. అదృష్టము ప్రసన్నముగా నున్నపుడు మానవు డొక నిశ్చయమునకు వచ్చును. కాని యది తొలగుపోవు సమయమున సోమరితనము ప్రవేశించును.

372. దుష్టవిధి శక్తులను మందగింప జేయును. అదృష్టము పట్టమున్నపుడు మొట్టమొదట అది మానవుని బుద్ధిని వికసింప జేయును.

373. పాండిత్యమువలన, 'హిరణ్యాకరణము' ల వలన ప్రయోజన మేమి ? విధి తరుమునపుడు నైజాంధకారము తక్కిన సమస్తమును కప్పివేయును.

374. ఈ ప్రపంచము పరస్పర సంబంధములేని రెండు భాగములక్రింద విభజింపబడియున్నది. ఈ జీవితములో విజయమును సాధించుటొక విషయము. ఋషిసాంప్రదాయిక విత్తము నార్జించు టింకొక విషయము.

375. అదృష్టము నీకు వ్యతిరేకముగ నున్నపుడు మంచి విషయములు కూడ చెడ్డవిగ పరిణమించును. అది నీకు సుఖముగ నున్నపుడు చెడ్డకూడ మంచిగనే మారిపోవును.

376. విధినీకు నిరాకరించినదానిని నీ వెంతజాగ్రత వహించినను నిలుపుకొనజాలవు. నీదైన వస్తువు నీవు బుద్ధిపూర్వకముగ పారవేసినను పోజాలదు.

377. కోటిగడించినవాడైనను సర్వమును శాసించు శాసకుని యాదేశమునుమించి యధికముగ ననుభవింపజాలడు.

378. ఏమియులేని దరిద్రులు సన్యసించుటకు నిశ్చయముగ కుతూహలపడవచ్చును. కాని విధి వారనుభవింపవలసిన దుఃఖములను వారికొరకు ప్రత్యేకించియుండ నదెట్లు జరుగును?

379. మంచి సంభవించినపుడు సంతోషముతో నుబ్బి గంతులు వేయువాడు చెడ్డ యనుభవింపవలసినపుడు చిందులు త్రొక్కనేల?

380. విధికంటె బలవత్తరమైన దేదికలదు? దానిని జయింపవలెనని మానవు డెట్టి పథకములు వేసినను అది యతనికంటె ముందుగనే మేల్కొని యతనిని క్రిందదీయును.

ధర్మము అను శీర్షికగల

మొదటి భాగము

సమాప్తము

# మొదటి ప్రకరణము



రాజు

ముప్పదితొమ్మిదవ యధ్యాయము

## రాజుకుండవలసిన యర్హతలు

381. సైన్యము, ప్రజ, విత్తము, మంత్రము, మిత్రగణము, దుర్గములు—ఈయారుబలములుకల రాజు రాజసింహమనదగును.

382. ధైర్యము, వదాన్యత, చతురత, పటుత్వము — ఈనాలుగు గుణములు రాజులో నెన్నడు లోపింపరాదు.

383. మెలకువ, పాండిత్యము, సులభనిశ్చయము — ఈ మూడుగుణములు రాజ్యముచేయుటకు విధింపబడిన వానిని విడువరాదు.

384. రాజు పాడితప్పరాదు. అతడధర్మమును నిర్మూలింపవలెను; అతడు తనగౌరవమును శ్రద్ధతో కాపాడుకొనవలెను; పరాక్రమ సూత్రములను వీడరాదు.

385. రాజు తనరాజ్యములోని నిధినిక్షేపములనెట్లు అభివృద్ధి పరచవలయునో, తనఖజానా నెట్లు నింపవలయునో తెలిసికొనవలయును. అతడు తన విత్తము నెట్లు రక్షించుకొనవలయునో, దాని నెట్లు శ్లాఘనీయముగ వినియోగింపవలయునో గ్రహింపవలయును.

386. అతడు ప్రజలందరకు అందుబాటులోనుండి, వాక్పారుష్యము నెన్నడునుపయోగింపనిచో నతనిరాజ్యము తదితరుల రాజ్యముకంటె మిన్నదిగ భావింపబడును.

387. ప్రేమతో తన ప్రజలను రాజ్యముచేయుచు, ప్రసన్నవదనుడై పారితోషికముల నొసంగురాజుకీర్తి భూమిమీద వ్యాప్తిచెందును. అతడే దేశమును జయింపగోరినను అది యతని వశమగుచుండును.

388. తనప్రజలకు రక్షణయిచ్చుచు న్యాయమును నిష్పక్షపాతముగ ప్రయోగించు రాజు మానవులలో దైవముగ భావింపబడును.

389. కర్ణకఠోరవాక్కులను సహనముతో విను గుణసంపదగల రాజు ప్రజలు అతని రాజ్యఛత్రఛాయలనెన్నడు విడువ నొల్లరు.

390. వదాన్యత, ప్రసన్నత, న్యాయము, నిజప్రజను శ్రద్ధతో లాలించుట — ఈగుణములుగల రాజు రాజలోకమునకే వెలుతురు వంటివాడు.

## నలుబదియవ యధ్యాయము

# పాండిత్యము

391. ఆర్జింపదగిన జ్ఞానమును క్షుణ్ణముగ సంపాదింపుము. కాని దానిని సంపాదించిన తరువాత అది శాసించు తీరున నడుచుకొనుము.

392. ప్రాణికోటికి రెండుకండ్లు ప్రసాదింపబడినవి: ఒకటి సంఖ్యాశాస్త్రము. రెండవది శబ్దశాస్త్రము లేక అక్షర శాస్త్రము.

393. విద్యకలవాడే నేత్రములు కలవాడు అనదగును. విద్య లేనివారి కండ్లు తలలోనున్న రెండుపుండ్లు.

394. విద్యావంతుల సమాగమ మొక ఆనందోత్సవము. వారియెడబాటు హృదయస్ఫుట వేదనము.

395. ముష్టివాడు ధనవంతునిమ్రొక్కునట్లు నీవు గురువును మ్రొక్కవలసి వచ్చినను నీవు విద్యాధనము నార్జించినవాడవగుదువు. విద్యనేర్చుకొన తిరస్కరించువారే మానవులలో నధమాధములు.

396. జ్ఞానము సైకతహ్రదము వంటిది. నీవు దానిని త్రవ్వఁ కొలది, త్రాగినకొలది అది యనవరతము పారుచునే యుండును.

397. విద్యావంతున కీప్రపంచమంతయు గృహమే. ప్రతి చోటు అతని జన్మభూమియే. ఇట్లుండ మృత్యుదినము వచ్చు వరకు విద్యనేర్చుకొనుటకు మానవుడేల శ్రద్ధవహింపడో తెలియకున్నది!

398. మానవుడీజన్మలో సంపాదించు విద్య యేడుతరముల వరకు నతనికుత్తమగతులనే కల్పించును.

399. విద్య తనకొక్కనికేగాక వినువారికికూడ ఆనందము కలుగఁజేయునని విద్యావంతుడెరుంగును కనుకనే దానికొరకే యతడు విద్యను మరింత ప్రేమించును.

400. విద్య మానవునకు నాశములేని ధనము; కలంక రహితమైన నిధి. దానిముందు యితర ధనము లింధనములు.

నలుబదియొకటవ యధ్యాయము

# విద్యా నిరసనము

401. జ్ఞానసమృద్ధి లేకుండ సభావేదికపై కెక్కుట జూదపు బల్ల లేకుండ జూదమాడుటవంటిది.

402. విద్యావైభవము లేకుండ వక్తననిపించుకొన గోరు వాడు స్తనములు లేకుండ పురుషులను రంజింపజేయగోరు స్త్రీ వంటివాడు.

403. పండితులమధ్య నోరువిప్పకుండినచో మూర్ఖుడుకూడ బుద్ధివంతుడుగ చలామణియగును.

404. విద్య లేకుండినను బుద్ధివంతుడుగనే యుండిన యుండ వచ్చును. కాని విజ్ఞులు అట్టివాని యభిప్రాయముల కెట్టి విలువ యివ్వరు.

405. విద్యను నిర్లక్ష్యముచేసి తన దృష్టిచే తాను బుద్ధివంతు డనుకొనువాడు సభలో మాట్లాడుటకు పెదవులను విప్పగానే సిగ్గుపడక తప్పదు.

406. ఊసరక్షేత్రములో పంటపండనట్లే విద్యను నిరసించిన వాడు రాణింపనేరడు. మానవులుగుర్తించి అతడు 'జీవించి యున్నాడు' అని అందురేకాని యంతకుమించి యేమియు చెప్పరు.

407. సౌశీల్యత, ఉదారత, లేని బుద్ధికలవాని యంద చందము లెంతటివైనను మట్టి విగ్రహమునకుండు అందము వంటివే యగును.

408. విద్యావంతుడు నిర్ధనుడగుట విచారింపదగినదే! కాని మూర్ఖునిచేతిలో ధనముండుట మరింత యధ్వాన్నమైన విషయము.

409. ఎక్కువకులములో పుట్టిన మూర్ఖుడు తక్కువ కులములో పుట్టిన విద్యావంతునికంటె అధముడుగ భావింపబడును.

410. పశువులకంటె మానవులెంత యుత్కృష్టులో కదా! అట్లే విద్యావిహీనులకంటె పండితు లధికులుగ భావింపబడ వలయును.

నలుబదిరెండవ యధ్యాయము

## శ్రుత పాండిత్యము

411. ఈప్రపంచ నిధులన్నిటిలోను కర్ణమునకు సంబంధించిన నిధియె బాల్యమైనది. నిజమున కది విత్తములకెల్ల రాజు అనదగును.

412. కర్ణములకు విందుచేయ నొల్లక నీ కుక్షిలో నెదో యొకటి పారవేయుచునే యుండుటోక చోద్యము కాదా ?

413. చెవులద్వారా ప్రబోధింపబడి శృతపాండిత్యము గడించిన వారు భూమిమీాద దేవతలే యనదగుదురు.

414. చదువు లేకపోయినను జ్ఞానబోధలను వినుట గొప్ప విషయము. ఏలన కష్టములు నెదుర్కొనవలసినపు డది గొప్ప యాధారమగును.

415. పవిత్రపురుషు లిచ్చుసలహా స్థిర దండమువంటిది. అది దాని శ్రోతలను జారిపడిపోకుండ రక్షించును.

416. కొద్దినైనను నుంచిమాటలను వినుము. నీవు విను ఆ కొద్ది మాటలే వాటికి తగినట్లు నీ గౌరవమును పెంచును.

417. స్వయముగ ధ్యానపరుడై, జ్ఞానుల ప్రసంగములను విని ప్రబోధనిధిని సెకరించుకొనినవాడు ప్రమాదగ్రస్తుడైనను అర్థరహితముగ మాట్లాడడు.

418. జ్ఞానప్రబోధములచే శిక్షింపబడని చెవి వినుచున్నను చెవిటిదేయని భావింపదగును.

419. జ్ఞానుల వివేక వచనములను విననివారు వినయముగ సంభాషింప జాలరు.

420. జిహ్వారుచి తప్ప కర్ణరుచి నెరుగనివారు బ్రతికి యున్నను చచ్చినను ప్రపంచమున కేమి కొదువ ?

నలుబదిమూడవ యధ్యాయము

# తె లి సి కో ను ట

421. తెలిసికొనుట యను కవచము అన్నిదాడులనుండి మానవుని రక్షింప గలదు. ఇది శత్రువులకు కూడ నభేద్యమగు దుర్గము.

422. సుశిక్షితబుద్ధి యింద్రియ చాపల్యముల నరికట్టును. చెడ్డవంకకు పోకుండచేయును. మంచికి మరలించును.

423. 'వినదగు నెవ్వరుచెప్పిన । వినినంతనె వేగపడక వివ రింపదగున్ । కని కల్ల నిజము తెలిసిన మనుజుడెపో నీతిపరుడు...'

424 జ్ఞాని పరులందరకు నర్థమగునట్లు మాట్లాడును. ఆత డితరుల పెదవులనుండి వెడలుమాటల సూక్ష్మార్థములనే సేక రించును.

425. జ్ఞాని ప్రజలందరను తనవైపున కాకర్షించు కొనును. అతని స్వభావము హద్దులుతప్పిన సంకోచవికాసముల ననుభ వింపక సదా సమత్వమునే వహించును.

426. ప్రపంచరీతుల కనుగుణముగ తనను దిద్దుకొనుచుండుట జ్ఞానములో ఒక భాగమే యగును.

427. జ్ఞానసంపన్నుడు రానున్నదానిని గ్రహింప గలడు. కాని మూర్ఖుడు తనముందర నున్నదానినికూడ చూడజాలడు.

428. ఉపద్రవము లోనికి తల్లక్రిందులుగ చొరబడుట దోషమే. కాని భయపడవలసిన దానినుండి భయపడకుండుట బుద్ధివంతుని లక్షణము.

429. ప్రతి యుపద్రవమునుండియు రక్షించుకొనగల దూర దృష్టిగలవానికి వణకవలసిన దెబ్బ యుండనే యుండజాలదు.

430. చక్కగా తెలిసికొనినవానికి సమస్తము లభ్యమగును. సమస్తము కలిగియున్నను మూర్ఖుడేమియు కలిగియుండజాలడు. అసగా నతడు వాటి యజమాని కాజాలడు.

నలుబది నాల్గవ యధ్యాయము

## దోష రాహిత్యము

431. గర్వము, కోపము, అల్పత్వములేని యైశ్వర్యవంతుని యైశ్వర్యమున కొక వింతశోభ చేకూరును.

432. లుబ్ధత్వము, అమిత విశ్వాసము, అతిలోలత — ఈ మూడు రాజుకు పనికిరావు.

433. తమకీర్తిని పట్టుదలతో కాపాడుకొనువారికి తమ దోష మావగింజంతదైనను తాళప్రమాణమువలెకాన్పించును.

434. నీదుర్బలత్వములనుండి నిన్ను నీవు పట్టుదలగ కాపాడు కొనుము. అవియే నిన్ను నాశముచేయు నీశత్రుగణము.

435. ఆకస్మికసంభవములకై ముందుగనే మేల్కొని తగిన వసతులు నేర్పరచు కొననివాడు అగ్నికణముచే దహింపబడు గడ్డిమేటివలె ధ్వంసము కావింపబడును.

436. రాజు ముందుగ తనదోషములనుదిద్దుకొని యితరుల దోషములను పరికించుచో నతనికి సంభవింపగల చేటు యేది కలదు ?

437. ఖర్చు పెట్టవలసిన చోట ఖర్చుపెట్టని పిశినిగొట్టు యైశ్వర్యము చివర కూరుపేరులేకుండ ధ్వంసమగును.

438. ముష్టివిదపని లుబ్ధత్వము నితరదోషములతో పోల్చ తగదు. దానికదియొక ప్రత్యేకజాతిక్రింద వచ్చును.

439. ఏ కాలమందు దేనికొరకు నుబ్బిపోకుము. నీ కే మంచియు చేకూరని వ్యాపారములలో కలుగజేసికొనకుము.

440. నీ హృదయమే యే విషయములందు రమించునో వానిని నీ వితరులకు వెల్లడిచేయకుందువేని నీశత్రువులవ్యూహము లన్నియు నిరర్థకము లగును.

## నలుబదియైదవ యధ్యాయము

# స త్స హ వా స ము

441. ధర్మవృద్ధులను గౌరవింపుము; వారి మైత్రి సంపాదింపుము.

442. నీకు ప్రాప్తించిన చెడుగులను పరిహరింపగలట్టియు ప్రాప్తింపగల వాని నుండి రక్షింపగలట్టియు సత్పురుషుల సహవాసము నరమరలేకుండ సంపాదింపుము.

443. పూజ్యులగువారి ప్రేమ చూరగొనుట యదృష్టములలోనికెల్ల యదృష్టమగును.

444. నీకంటె యోగ్యులు నీమిత్రులైనప్పుడు నీవు చేకూరగల బలములందరి తదితర బలములన్నియు నతి పేలవములగును.

445. రాజుయొక్క మంత్రులే యతని నేత్రములు. కనుక నతడు వారిని వివేకముతో నేర్పరచు కొనవలయును.

446. పూజ్యులైనవారితో స్నేహముగ మెలగు రాజు శత్రువులు అతని ముందు నిర్వీర్యులగుదురు.

447. తనను మందలింపగలవారి స్నేహము చూరగొనిన రాజు నెవరు నాశము చేయగలరు?

448. తనను మందలింపగలవారి సహాయముపై నాధారపడని రాజు శత్రువులులేనివాడైనను నశించును.

449. పెట్టుబడి లేనివానికి లబ్ధిలేనట్లు మనీషావంతుల అకలంక బలము లేని వారికి స్థిరశాంతి యెట్లు చేకూరగలదు?

450. ఎక్కువమందిని శత్రువులుగా చేసికొనుట యవివేకము కాని మంచివారి స్నేహము వదలుకొనుట పదిరెట్లు మరింత బుద్ధిహీనమైనపని.

నలుబది యారవ యధ్యాయము

## నీచ సహవాసమును వర్జించుట

451. యోగ్యులు దుష్టసంపర్కమును కిచ్చగింపరు. కాని యల్పమనస్కు లట్టివారితో మక్కువమై యేకకుటుంబమువలె వర్తింతురు.

452. నీరు ప్రవహించుభూమి స్వభావమునుబట్టి నీటిగుణము మారిపోవుచుండును. ఆ విధముగనే మనస్సు తను వహించు సహవాసము యొక్క రంగుతో ప్రకాశించును.

453. మానవుని ప్రజ్ఞావిశేష మతని మనస్సును బట్టి యుండును. కాని యతనికీర్తిమాత్ర మతని మిత్రగణమును బట్టి యుండును.

454. మానవుని నడవడిక యతని మనస్సునుబట్టి యుండు నట్లు కాన్పించును. కాని నిజమున కతని మిత్రబృందమే దానిని నిర్ణయించును.

455. మానవుని పవిత్ర సహవాసమును బట్టియే హృదయ పవిత్రత, కర్మపవిత్రత యేర్పడును.

456. పవిత్ర హృదయులు ధర్మప్రజాసమృద్ధు లగుదురు. సత్సహవాసము కలవారికి సర్వము సమకూరును.

457. పవిత్ర హృదయమే మానవుని పెన్నిధి. సత్సహవాస మతనికీర్తి నన్నివిధముల నినుమడింపజేయును.

458. ప్రజ్ఞావంతులు తమకు తామే గుణనిధులైనను పూజ్యుల సహవాసము నొక పెట్టని కోటగా భావింతురు.

459. పుణ్యము స్వర్గమునకు మార్గము. సత్పురుషుల సహవాసము పుణ్యాచరణకు స్థైర్యము నొసగూర్చును.

460. మానవునకు సత్సహవాసము మించిన గొప్ప మిత్ర మింకొకటి లేదు; దుష్టసహవాసము తెచ్చిపెట్టు కష్టములను మించిన కష్టములులేవు.

## నలుబది యేడవ యధ్యాయము

# యోచించి పని చేయుట

461. ఒక వ్యవహారములో నీకు సమకూరు లాభము, నష్టము, నీకు మిగులు నికరము లెక్క చూచుకొనిన తరువాతనే నీ వందులో ప్రవేశింపుము.

462. వారి వారి యోగ్యతలను బట్టి యెన్నుకొనబడిన మంత్రుల సలహాలతో వ్యవహరించు రాజుకు దుస్సాధ్య మెందును లేదు.

463. పెద్దలాభము కలుగునట్లు పైకి కన్పించు వ్యవహారములు కొన్ని కలవు. కాని చివరకు వాటి పెట్టుబడికూడ నశించును. బుద్ధివంతు లట్టివానిని చేపట్టరు.

464. పరుల యవహేళనలకు భయపడు మానవు లేవ్యవహారమును పూర్వాలోచనలేకుండ చేయనే చేయరు.

465. ప్రతి చిన్న వివరమును ముందుగనే లెక్క వేసికొనకుండ యుద్ధములోనికి దిగుచో నీ శత్రువును సురక్షిత స్థానములో నుంచినవాడ వగుదువు.

466. నీవు చేయకూడని పనులు కొన్ని కలవు. వానిని చేతువేని నీ నాశము తథ్యము, నీవు విధాయకముగ చేయవలసిన విధులు కొన్ని గలవు. దానిని చేయకపోయినను నీకు నాశము తప్పదు.

467. ఏపనిని జాగ్రత్తగ విచారించి కాని చేయరాదు. మొదట ప్రారంభించి 'తరువాత నాలోచించెదను' అని తన హృదయములో ననుకొనువాడు మూర్ఖుడు.

468. తనపనిని యథాన్యాయముగ నాచరింపనివాని కెంత మంది సాయపడినను అతని శ్రమయంతయు వ్యర్థమగును.

469. మంచిచేయుటలో కూడ తెలబ్ధి పొందువాని శీలమున కది తగియుండ దేని నీవు తప్పుచేసినవాడవే యగుదువు.

470. నీవు నిశ్చయించు విషయము దోషరహితముగ నుండుగాక ఆత్మగౌరవమునకు భంగమైన పనికి దిగిన మానవుని లోకము నిందించును.

నలుబదియెనిమిదవ యధ్యాయము

## శత్రుబలమును నిర్ణయించుట

471. తనబలాన్ని, యెదిరిబలము, సాధింపవలసినకార్యములో గల కష్టములు, మిత్రబలము — వీనిని యథాతథముగ విలువ కట్టుకొనిన మీదటనే యుద్ధరంగములోకి దిగవలెను.

472. నిజసైన్యబలము యొక్క వివరములను, తను నేర్వ వలసిన దానిని కూలంకషముగ నేర్చుకొని తన బుద్ధిబల, సైన్య బలముల హద్దులను దాటని రాజుదండయాత్ర లెన్నటికిని విఫలముకావు.

473. తన బలమును గురించి తమలో తాము విపరీత గుణకారములను చేసికొని సాహసకార్యములకు దిగినవా రనేకులు కలరు. కాని యట్టివారు మధ్యలోనే హతాశులై నిహతులగుచుండిరి.

474. శాంతచిత్తులు కానివారు, తమ ప్రమాణమును గుర్తెరుగనివారు, గర్విష్ఠులు శీఘ్రముగనే నశింతురు.

475. బండినిండ పడత్రొక్కినచో బర్హిబర్హములే యైనను బండియిరుసును తునియలుచేయును కదా !

476. వృక్షశిఖరాగ్రముల నెక్కియు నింకను పైకెగబ్రాకయత్నించువారు తమ ప్రాణములనే కోల్పోవుదురు.

477. మొదట నీకున్న దానిని చూచుకొనుము. దానిని బట్టి యథోచిత దానధర్మములు చేయుము. నీవిత్తరక్షణమునకు పంపకమునకు నదియే సరియైన మార్గము.

478. నీరుపోవు మార్గ మెక్కువ విశాలముగ నుండనిచో నీరువచ్చుమార్గము యిరుకుగనున్నను విచారింపవలసిన పనిలేదు.

479. తనయాదాయమును లెక్కవేసికొని దానిహద్దుల మధ్య జీవింపనివాడు వెలుగుచున్నట్లు కన్పించుచు చివర కేమియు లేకుండ బుడుంగుమని మునిగిపోవును.

480 ప్రమాణజ్ఞానము లేకుండ తనధనమునంతను విచ్చలవిడిగ చేతికివచ్చినట్లు ఖర్చుపెట్టు మానవుని యైశ్వర్యము నిమిషముల మీద హరించిపోవును.

# అదను దలంచుట

481. తెల్లవారినచో కాకి దివాంధముపై విజయము ప్రకటించును. అట్లే జయింపగోరు రాజు అదను చూచుకొని తన శత్రువులపై పడవలెను. అదను గొప్పపదను.

482. కాలగతి సన్నిహితముగ ననుసరింపుము. అదృష్ట దేవతను స్థిరముగ కట్టివేయగల సూత్రమదియే.

483. అదనుదలంచి నీ వ్యవహారములోనికి నీవు దిగి యుచితమైన సాధనలను ప్రయోగింతువేని యసాధ్యమను వస్తువెందుండగలదు?

484. తగిన కాలమును తగినలక్ష్యములను కలిగియుందువేని నీవీ ప్రపంచమునంతనుకూడ జయింపగలవు.

485. విజయములపై కన్నువేసి చూచువారు తమ యదను కొరకు కాచియుందురు. వారెంతమాత్రము తొట్రుపడరు, తొందరపడరు, కలగ్రొక్కరు.

486. దెబ్బతో శత్రువు మూర్ఛిల్లునట్లు తాకుటకే గొర్రెపొట్టేలు వెనుకకు పోవును. శక్తివంతుల కార్యోపేక్ష కదియే కారణము.

487. బుద్ధివంతులు తమ కోపము నా నిమిషమందే కనబరచరు. వారు దానిని తమ హృదయములలో పదిలబరచుకొని సమయముకొరకు వేచియుందురు.

488. శత్రువులు నీకంటె బలవంతులైనపుడు వారి ముందు తల వంచుము. వారిబలము క్షీణదశలో నున్నపుడు నీవు వారి నోడించుట సుకరము.

489. నీకే దేని యొక యపూర్వావకాశము లభించెనేని తడవుసేయక సాధ్యమైనదానికి కూడ యత్నింపుము.

490. కాలము నీ కనుపపన్నముగ నుండునేని కొంగవలె యకర్మను నటింపుము. కాని కాలము తిరుగబడిన తోడనే రివ్వుమని కార్యరంగముపై కురుకుము.

ఏబదియవ యధ్యాయము

# యుద్ధభూమి నిర్ణయము

491. యుద్ధభూమిని కూలంకషముగ పరిశీలించి నిర్ణయము చేయువరకు యుద్ధమును రేపకుము; యుద్ధసన్నాహముల నాయత్తము చేయకుము.

492. ఎంతటి శక్తివంతులైనను ఎంతటి బలవంతులైనను అభేద్యములగు దుర్గముల నాశ్రయించు టతిలాభదాయకము.

493. సరియైన రంగస్థలమును నిర్ణయించుకొని జాగరూకతతో సంభారములను సమకూర్చుకొనుచో దుర్బలులైనను బలవంతునితో నెదిరి పోరగలరు; జయము పొందగలరు.

494. ముందుగ స్థల శల్యపరీక్ష గావించి యుంచుకొనిన దుర్గమ స్థావరముల నాతగాగాని పోరునప్పుడు వేని నీశత్రువు యొక్క వ్యూహములు నిర్వీర్యములగును.

495. లోతునీళ్ళలో మొసలి సర్వశక్తి సంపన్నురాలు. బయటకు వచ్చునేని వాని శత్రువులకది యొక యాటవస్తువగును.

496. రథము సముద్రయానమునకనర్హమైనది. సముద్రము మీద ప్రయాణించు ఓడ భూమిమీద అంగుళమైనను పోజాలదు.

497. సర్వమును ముందుగనే పన్నుకొని సరియైన లక్ష్యముపై గురిపెట్టి కొట్టురాజుకు నిజధైర్యము తప్ప మరెట్టి మిత్రము నవసరము లేదు.

498. దుర్బల సైన్యము కలరాజు తగిన యుద్ధరంగము నధిష్ఠించిన చాలును. బలవంతుడైన శత్రువు ప్రయత్నములుకూడ నతని ముందు వ్యర్థమగును.

499. తగిన రక్షణలుకాని, యితర సౌకర్యములు కాని లేకున్నను స్థానబలము కలిగియున్న ప్రజల నోడించుట కష్టము.

500. నిరంతర బాణపరంపరలు కురిపించు వేటకాండ్ర నిసుమంతయు లక్ష్యపెట్టని మదగజమైనను బురదలో దిగబడినచో బక్క నక్కకు లొంగుబాటై చిక్కువడును.

ఏబదియొకటవ యధ్యాయము

## విశ్వాసపాత్రుల పరీక్ష

501. ధర్మాభిలాష, ధనాభిలాష, సుఖాభిలాష, ప్రాణభయము — ఈనాలుగు మానవుని పరీక్షలు. ఈనాలుగు పరీక్షలకు నిలిచిన వానినే విశ్వసింపుము.

502. కులీనుడు, దోషరహితుడు, అపయశస్సుకు భయపడువాడు నగువాడే నీ నభిలషింపదగిన వాడు.

503. ఎంతటి విద్యాపారంగతులైనను, ఎంతటి పవిత్రహృదయులైనను యజ్ఞానమునుండి పూర్తిగా విముక్తులైనవారు కానరారు.

504. మానవుని మంచిని, చెడుగును రెంటిని తూచుము. ఇందులో నేది యధికముగ నుండునో అదియే యతని స్వభావమని తెలిసికొనుము.

505. ఎవ డుదారుడో, ఎవడు అల్పమనస్కుడో కనుగొనగోరుదువా? ప్రవర్తనయే శీలమునకు ఒరిపిడిరాయి.

506. బంధుమిత్రులు లేనివారిని విశ్వసించు పట్ల జాగ్రత వహింపుము. ఏలన వారి హృదయములలో ననురాగ ముండదు. వారు సిగ్గుచెందుటకు భయపడరు.

507. నీకు ప్రేమ యున్నంత మాత్రముచేత నీవొక మూర్ఖుని యంతరంగ సలహాదారుగ చేసికొందువేని యాతడు నిన్నంతులేని ప్రమాదములలోనికి దింపును.

508. పరీక్షింపక పెరవానిని నమ్మువాడు తన సంతతి గూడ తీరని కీడుచేసినవా డగును.

509. పరీక్షింపక యెవనిని విశ్వసింపకుము. పరీక్షించిన మీదట ప్రతివానికి వానికితగిన పనియే చెప్పుము.

510. పరీక్షింపని మనుజుని విశ్వసించుట ; యోగ్యుడని తెలిసినవానిని అనుమానించుట — ఈ రెండుపనులు నిరంతర కష్టములనే తెచ్చిపెట్టును.

ఏబదిరెండవ యధ్యాయము

## పరీక్షించి యుద్యోగమిమ్ము

511. మంచిచెడుగులను రెంటిని చవిచూచి మంచిని మాత్రమే స్వీకరించు పురుషునకే యుద్యోగమిమ్ము.

512. నీరాజ్యములోని ప్రకృతిసంపద నభివృద్ధిపరచగల వానిని, దానికి సంభవించు దోషములను నివారింపగల వానిని నీవ్యవహారములను నిర్వహించుటకు నియోగింపుము.

513. దయ, వివేకము, నిశ్చయము గలవారిని, పేరాసలేని వారిని మాత్రమే సేవకులను చేసికొనుము.

514. అన్నిపరీక్షలకు నిలువగలవా రెందరో యుండ వచ్చును. కాని ధర్మము నాచరింపవలసినచోట వారు దిగజారి పోవుచుందురు సుమా.

515. ఆయాపనులలో దక్షులై, యోరిమితో కృషిచేయు గలవారికే పని చెప్పుము. నీకు ప్రేమపాత్రుడైనంత మాత్రము చేత నెట్టివానిని రాచకార్యములందు నియోగింపకుము.

516. నీసేవకుని పరీక్షించి తీసికొనదగును. అతడు దేని కర్హుడో ఆపనియే చెప్పుము. పనిచేయుట కదనైన కాల మగునో కాదో చూచి ఆపనిని ప్రారంభింపజేయుము.

517. ముందుగా నీ సేవకుని దక్షతను, అతనికి పనికివచ్చు పనిని నిశ్చయింపుము. తరువాతనే వానికాపనిలో బాధ్యతగల స్థానము నిమ్ము.

518. ఎవడే హోదాకు తగినవాడో తెలిసికొనుము. పిమ్మట అతడా హోదాను దిగ్విజయముగ నెరవేర్చుటకు తగిన గౌరవ మును వసతులను కల్పింపుము.

519. తనపనియందు నిపుణతగల సేవకుని స్వాతంత్ర్యము లను సరిగా నర్థముచేసికొనలేనివాని సంపద నిలువజాలదు.

520. రాజు ప్రతిదినము ప్రతిపని పరిశీలింప వలయును. ఏలనన రాజ్యములోనున్న ప్రభుత్వాధికారులలో నేదోషము లేనంతకాల మాదేశమునకెట్టి యుపద్రవము వాటిల్లజాలదు.

ఏబదిమూడవ యధ్యాయము

## బంధుప్రీతి

521. బంధువులైనవారొక్కరే విపదశలో నినునంటిపెటు కొని యుందురు.

522. తన నెల్లప్పుడు ప్రేమించు బంధువులుకలవాని యైశ్వర్య మెల్లప్పుడు పెరుగుచునే యుండును.

523. తన బంధువుల నతి చనవుగ కలిసికొనక వారి ప్రేమను చూరకొనజాలక యుండువాడు గట్లు తెగిన తటాకము వంటి వాడు. అతని యైశ్వర్యోదయము లతనినుండి తొలగిపోవును.

524. తన బంధువులను చేరదీసి లాలన పాలనలతో వారి నాదరించుటయే యైశ్వర్యము యొక్క యుపయోగము, ప్రయోజనము.

525. మృదుభాషియై యిచ్చుటలో చేతికెముక లేనివా డగుచో బంధువు లట్టివానిని దెప్పరముగ కప్పివేయుదురు.

526. కోపము నెరుగక చేతికొలది దానము చేయువాని కుండు బంధుసముద్రము ప్రపంచములో నెవరికి నుండజాలదు.

527. కాకి తనకు దొరికిన యాహారమును స్వార్థబుద్ధితో దాచక తన పరివారినందరను పిలిచి వారితో పంచుకొనును. అట్టి స్వభావము కలవారి యైశ్వర్యము మాత్రమే నిలచి యుండును.

528. రాజు తన ప్రజలనందర నొకేవిధముగ గాక వారి వారి యర్హతలనుబట్టి గౌరవించుటమేలు. ఏలనన చాలమంది యితరులకు లేని హక్కులను కోరుచుందురు.

529. నీబంధువుకు కలిగిన కష్టమును నీవు సులభముగ తీర్పవచ్చును. అతని శైత్యమునకు గల కారణమును తొలగింతువేని యతడు చక్కబడును.

530. నీతో విరోధించిన బంధువు తిరిగి నీదగ్గరకు వచ్చు నేని యతనిని సహేతుకముగ శాంతపరచుము; గాని నీవు మెలుకువకలిగి యుండవలెను.

ఏబదినాల్గవ యధ్యాయము

## అ ప్ర మ త్త త

531. అతికోపముకంటె కూడ సర్వజ్ఞుల మనకొనుటవలన కలుగు ప్రమాదము మరింత యధ్వాన్నమైనది.

532. దారిద్ర్యము జ్ఞానము నణచివేయును. అట్లే అతిభద్ర భావము కూడ యశస్సును హరించును.

533. అజాగరికతవలన ప్రభావము లభింపజాలదు. ప్రపంచములోని ప్రతివిజ్ఞానశాఖ యీ భావమునే వెల్లడించినది.

534. పిరికివారి కెన్నికోటలున్నను ఫలమేమి? జాగ్రతలేని వారి కెంతసంపద యున్ననేమి ఫలము?

535 ప్రతివిషయమునందు ముందుగనే మేల్కొనని వాడు ఆకస్మిక యుపద్రవము సంభవించిననాడు తన నిర్లక్ష్యమునకు డీల్ల పోవును.

536. సర్వదా సర్వప్రజలయందు నీవు మెలకువను వీడకుందువేని యిక కావలసిన దేమున్నది?

537. సదోదితము, ప్రజాగరితము నగు మనస్సుతో తన పనిని నిర్వహించు వానికి దుస్సాధ్య మేదియులేదు.

538. ప్రజ్ఞావంతులు శాసించు పనులను రాజు అవిరళ శ్రద్ధతో నెరవేర్చవలెను. అట్లుచేయు నిరాకరించుచో నతడు దాని ఫలితము నేడుతరములలో నెప్పుడో యొకప్పు డనుభవింపక తప్పదు.

539. సర్వజ్ఞత్వము, గర్వము అను దోషములు నిన్ను మోహపెట్టునేని నిర్లక్ష్యముచేతను, నిర్వీర్యతచేతను చెడిపోయిన వారి పేరులను జ్ఞప్తికి తెచ్చుకొనుము.

540. తన మనస్సు నెల్లపుడు తన లక్ష్యముపై కేంద్రీకరించునేని మానవునకు కోరు సమస్తము సులభముగ సాధింపబడును.

ఏబదియైదవ యధ్యాయము

# న్యాయ పరిపాలన

541. చక్కగా యోచింపుము. ఏపక్షమునకు మొగ్గకుము. పక్షపాతరహితుడవై న్యాయ పండితుల సహాయ తీసికొనుము. న్యాయము చెప్పుట కిదియే పద్ధతి.

542. ప్రపంచము జీవితముకొరకు జలదముల నపేక్షించును. అట్లే మానవులు రక్షణకొరకు రాజదండము నపేక్షింతురు.

543. బ్రాహ్మణ శాస్త్రములకు, ధర్మశాస్త్రమునకు కూడ రాజదండమే ప్రాణాధారము.

544. తనరాజ్యములోని ప్రజలను ప్రేమతో పాలించురాజు యొక్క సార్వభౌమత్వ మెన్నటికి నతనిని విడిచిపోజాలదు.

545. న్యాయానుసారము తన దండము నుపయోగించు రాజు రాజ్యములో సకాలవర్షములు కురియును; సస్యసమృద్ధి యుండును.

546. రాజువిజయమునకు కత్తి కారణము కాజాలదు. ఏ పక్షమునకు మొగ్గని ఋజువైన రాజదండమే యతని విజయము నకు కారణము.

547. రాజు తన ప్రజల కందరకు రక్షకుడు. అతనిని యతని రాజదండము (ఏపక్షము వహింపనిది) రక్షించును.

548. అందరకు సులభలభ్యుడు కానివాడు, తగు శ్రద్ధతో కార్యములను విచారింపనివాడు నగురాజు పదచ్యుతుడై శత్రువులు లేనివాడైనను నశించును.

549. ప్రజలను బహిరంతశ్శత్రువులనుండి రక్షించురాజు తన ప్రజలు తప్పుచేసినపుడు శిక్షించుట కళంకము కాదు; అది యతని ధర్మము.

550. దుర్మార్గులకు మృత్యుదండన విధించుట పరిపాలనము నండి కలుపు పెరికివేయుట వంటిది.

## ఏబదియారవ యధ్యాయము

# నిరంకుశత్వము

551. తన ప్రజలను పీడించుచు ననర్థచర్యలను చేయు రాజు హంతకునికంటె నికృష్టుడు.

552. న్యాయదండనచేయు రాజు ప్రార్థనయే 'నిలు, నిలు, ఒలిచియిండు' అను బందిపోటు శాసనమువంటిది.

553. తన పరిపాలనను ప్రతి నిత్యము పరిశీలించి యందలి యక్రమములను తొలగింపని రాజుసార్వభౌమత్వము రోజురోజు క్షీణించి పోవుచుండును.

554. ఎవనిపాలన న్యాయమార్గములనుండి పరిభ్రమించునో యట్టి వివేకహీనుడైన రాజు రాజ్యమును, విత్తమునుగూడ పోగొట్టుకొనును.

555. పీడింపబడు ప్రజలు విడుచు కన్నీటిధారలే రాజు యొక్క యైశ్వర్యమును నిశ్చయముగ నశింపుచేయును.

556. న్యాయమైన పరిపాలనయే రాజులకు కీర్తి తెచ్చును. దుర్మార్గ పరిపాలన వారి యశస్సును మలినపరచును.

557. వర్ష విహీనమైన ఆకసముక్రింద భూమి యెట్లు శోభించును? క్రూరుడైన రాజుపాలనక్రింద ప్రజ లావిధముగనే శోభింపజాలరు.

558. నిరంకుశుడైన రాజుపాలనక్రింద బీదవాని స్థితికంటె కూడ ధనికుని స్థితియే మరింత విషమముగనుండును.

559. రాజు న్యాయ, ధర్మపథములను తప్పినచో ఆకసము సకాలములో వర్షింపనే వర్షింపదు.

560. రాజు న్యాయముగా పరిపాలింపనిచో బ్రాహ్మణులు తమ శాస్త్రములను మరచిపోదురు. గోమాతపాడుగు శోషించి పోవును.

ఏబదియేడవ యధ్యాయము

# భయోత్పాతము కల్పించు పనులు చేయకుండుట

561. రాజు దోషియొక్క దోషప్రమాణమును గుర్తించి యతడు తిరిగి తప్పుచేయ కుండునట్లు శిక్షింపవలయును. కాని యా శిక్ష హద్దులు మీరి యుండరాదు.

562. తమ యధికారము చిరకాల ముండగోరువారు న్యాయదండమును చురుకుగ నుపయోగింప వలయును; కాని దానిని మృదువుగ ప్రయోగింపవలయును.

563. తన ప్రజలను చండప్రచండముగ శాసించుచు వారిలో భయోత్పాతము కల్పించు రాజు చివరకొక మిత్రుడు కూడ లేకుండ చేసికొని నశించును.

564. ఏ రాజు క్రౌర్యము తన ప్రజాళిహృదయములలో హత్తుకొనిపోవునో ఆరాజు శీఘ్రములోనే తన రాజ్యముపోగొట్టు కొనును ; మరియు నతని దినములుకూడ దగ్గరపడును.

565. తన ప్రజల కందుబాటులో లేని మూర్ఖరాజు చేతి లోని ధనము రాక్షసిచే రక్షింపబడు నిధివంటిది.

566. రాజు వాక్పారుష్యము కలిగినవాడై, క్షమారహితు డైనచో నట్టివాని విభవ మెంతటిదైనను శీఘ్రములోనే నశించును.

567. సరసనరళి తప్పిన విరసవాక్యములు, ప్రమాణము తప్పిన శిక్షలు అధికారాయఃపిండము నరగదీయు ఆకురాళ్లవంటివి.

568. తన ప్రణాళికలు వ్యర్థమైనపుడు తన మంత్రుల సలహా తీసుకొనక వివేకభ్రష్టుడైన రాజుసంపద నశింపక తప్పదు.

569. అవకాశ ముండగనే తన రక్షణాలను బలపరచుకొనని రాజు శత్రుదాడికి వణకిపోవుచు చివరకు నశించును.

570. మూర్ఖులతోను, శఠులతోను మైత్రిచేయురాజు అవివేక భారమునకే భూమి విలపించును. దానినిమించినదింకొకటి లేదు.

ఏబదియెనిమిదవ యధ్యాయము

# దయ

571. ఆహా ! దయ యెంతటి యనన్యలావణ్య సుందరి. లోకమంతయు దీని ప్రభావముచేతనే సుఖశాంతుల ననుభవింప గలుగుచున్నది.

572. దయ మూలముననే జీవితసౌకర్యము లన్నియు కల్పింప బడుచున్నవి. అది లేనివారు భూమికి బరువుచేటు.

573. పాడుటకు వలనుపడని పాటయొక్క ప్రయోజన మేమి ? ప్రేమచూపలేని కంటివలన ప్రయోజన మేమి ?

574. పరులయెడ వారివారి ప్రమాణములనుబట్టి దయ చూపక కేవలము తన ముఖమునుమాత్రమేచూపు కండ్లవలన ప్రయోజన మేమి ?

575. దయయే కంటి కలంకారము. అదిలేని కన్ను కేవలము శరీరములో నొకపుండువంటిది.

576. పరులపై దయచూపలేని కండ్లుగలమానవులు భూమి మీఁద జడముగనుండు చెట్లకంటె నేవిధముగ శ్రేష్ఠులు కాగలరు ?

577. పరులపై దయచూపలేని నరులు నిజముగ గ్రుడ్డివారు. ఇతరుల దోషములను పరిగణింపనివారే యథార్థ దృష్టి కలవారు.

578. తనవిధుల కెట్టిభంగములేకుండ పరులపై దయచూప గలవాడే యీభూమి కధికారి.

579. నిన్నవమాన పరచినవారిని క్షమించుటయేకాక వారి యెడల దయకూడ చూపుటయే గొప్పతనము.

580. దయాసముద్రులని పిలువబడ గోరువారు తమ కండ్ల యెదుట తమకొఱకే కలుపబడిన విషమును కూడ గడగడ త్రాగివేయుదురు.

564. ఏ రాజు క్రౌర్యము తన ప్రజాళిహృదయములలో హత్తుకొనిపోవునో ఆరాజు శీఘ్రములోనే తన రాజ్యముపోగొట్టు కొనును ; మరియు నతని దినములుకూడ దగ్గరపడును.

565. తన ప్రజల కందుబాటులో లేని మూర్ఖరాజు చేతి లోని ధనము రాక్షసిచే రక్షింపబడు నిధివంటిది.

566. రాజు వాక్పారుష్యము కలిగినవాడై, క్షమారహితు డైనచో నట్టివాని విభవ మెంతటిదైనను శీఘ్రములోనే నశించును.

567. సరససరళి తప్పిన విరసవాక్యములు, ప్రమాణము తప్పిన శిక్షలు అధికారాయఃపిండము నరగదీయు ఆకురాళ్లవంటివి.

568. తన ప్రణాళికలు వ్యర్థమైనపుడు తన మంత్రుల సలహా తీసుకొనక వివేకభ్రష్టుడైన రాజుసంపద నశింపక తప్పదు.

569. అవకాశ ముండగనే తన రక్షణాలను బలపరచుకొనని రాజు శత్రుదాడికి వణకిపోవుచు చివరకు నశించును.

570. మూర్ఖులతోను, శఠులతోను మైత్రిచేయురాజు అవివేక భారముననే భూమి విలపించును. దానినిమించినదింకొకటి లేదు.

ఏబదియెనిమిదవ యధ్యాయము

## దయ

571. ఆహా ! దయ యెంతటి యనన్యలావణ్య సుందరి. లోకమంతయు దీని ప్రభావముచేతనే సుఖశాంతుల ననుభవింప గలుగుచున్నది.

572. దయ మూలముననే జీవితసౌకర్యము లన్నియు కల్పింప బడుచున్నవి. అది లేనివారు భూమికి బరువుచేటు.

573. పాడుటకు వలనుపడని పాటయొక్క ప్రయోజన మేమి ? ప్రేమచూపలేని కంటివలన ప్రయోజన మేమి ?

574. పరులయెడ వారివారి ప్రమాణములనుబట్టి దయ చూపక కేవలము తన ముఖమునుమాత్రమేచూపు కండ్లవలన ప్రయోజన మేమి ?

575. దయయే కంటి కలంకారము. అదిలేని కన్ను కేవలము శరీరములో నొకపుండువంటిది.

576. పరులపై దయచూపలేని కండ్లుగలమానవులు భూమి మీద జడముగనుండు చెట్లకంటె నేవిధముగ శ్రేష్ఠులు కాగలరు ?

577. పరులపై దయచూపలేని నరులు నిజముగ గ్రుడ్డి వారు. ఇతరుల దోషములను పరిగణింపనివారే యధార్థ దృష్టి కలవారు.

578. తనవిధుల కెట్టిభంగములేకుండ పరులపై దయచూప గలవాడే యీభూమి కధికారి.

579. నిన్నవమాన పరచినవారిని క్షమించుటయేకాక వారి యెడల దయకూడ చూపుటయే గొప్పతనము.

580. దయాసముద్రులని పిలువబడ గోరువారు తమ కండ్ల యెదుట తమకొరకే కలుపబడిన విషమును కూడ గడగడ త్రాగివేయుదురు.

ఏబదితొమ్మిదవ యధ్యాయము

# చారులు

581. రాజనీతిశాస్త్రము, వార్తాయుక్తసైన్యము- ఈ రెండు కండ్లద్వారా చూడవలయునని రాజు గుర్తించునుగాక.

582. ప్రతిదినము, ప్రతిమనిషికి సంభవించు ప్రతివిషయమును సకాలములో తెలిసికొనుట రాజుయొక్క ధర్మము.

583. చారుల మూలమునను, వేగులవారి ద్వారమునను తనచుట్టు జరుగుచుండు విషయములను తెలిసికొనని రాజు విజయములను సాధింపజాలడు.

584. తనబందుగులయొక్కయు, తన రాజ్యములోని యధికారులయొక్కయు తన శత్రువులయొక్కయు చేష్టలనన్నింటిని లెస్సగా పరిశీలించుటకు రాజు వేగులవాండ్రను నియోగింపవలయును.

585. శంకింపరాని యాకారము, నెవ్వనియందు తొట్రుపడని స్థైర్యము, రహస్యగోపనము — ఈ శక్తిత్రయము కలవానినే చారునిగ నియోగింపదగును.

586. చారులు, వార్తాహరులు సన్న్యాసులవలెను, తీర్థవాసులవలెను వేషములు వేసికొని కూలంకషమైన పరిశోధనలు సలుపవలెను. తమకేమి సంభవించినను వారు తమ రహస్యములను వెలిబుచ్చరాదు.

587. ఇతరుల గుట్టుతీయఁగలవాడు, నిర్దుష్టము, అసందిగ్ధము నగు సమాచారమును పోగుచేయఁగల వాడు వేగులవాడుగ నుండవలెను.

588. చారసంపాదిత సమాచారము నితరచారులద్వారా పరిశోధింపవలెను.

589. ఈచారులలో నొకరిని గురించి మరియొకరి కేమియు తెలియకుండవలయును.

590. వార్తాధికారుల నెన్నఁడు బహిరంగముగ బహూకరింపరాదు. అట్లుచేయుచో నీరహస్యమును నీవేవెల్లడించు కొనినవాడవగుదువు.

## అరువదియవ యధ్యాయము

# శక్తి

591. శక్తి కలవారే విత్తవంతు లనదగుదురు. అది లేని వారు వారి కున్నదానిని నిజముగ కలిగియున్న వారగుదురా?

592. శక్తి యొక్కటే మానవుని విత్తము. శక్తిగాని ధనము శాశ్వతముకాదు. అది యెప్పుడో యొకనాడు మానవుని విడిచి పోవును.

593. అవిరళశక్తి యను విత్తము కలవారు "అయ్యో మేము నశించిపోతిమి" అను నైరాశ్యవాక్యముల నెన్నడు వచింపరు.

594. లక్ష్మి యుద్యోగమును విరమింపని ప్రయత్న శీలుని గృహము వెతకికొనుచువచ్చి తనంత తాను ప్రవేశించును.

595. లతాంతశోభ యాలత త్రావిన తోయసమృద్ధిపై యధారపడునట్లు మానవుని యుత్సాహతోయమే యతని యదృష్టము యొక్క ప్రమాణము.

596 నీ ప్రయోజనము లన్నియు మహోన్నతములుగ నుండుగాక. వలనన ఒకవేళ అవి విఫలములైనను నీ కీర్తి సదా నిష్కళంకముగనే యుండును.

597. ఓటమి కలిగినపు డుత్సాహవంతు లెన్నడు ధైర్యము వీడరు, తీక్ష్ణబాణముచే కొట్టబడినపుడే మదకరి తనపాదము లను మరింత స్థిరముగ నాటుచుండును.

598. శక్తి విహీనుల కంతులేని యౌదార్యజనిత ప్రభావ మెన్నటికి కలుగనేరదు.

599. పెద్దపులిని తలచినంతనే హృదయము కృంగిపోవుహస్తి కళేబర మెంత యున్ననేమి? దాని దంతములెంతవాడివైననేమి?

600. ఉత్సాహబలమే బలము. అదిలేనివారుశుద్ధ మొద్దులు. వారి మానవాకారమే వారికున్న విశేషము.

అరువదియొకటవ యధ్యాయము

# అ ల స త్వ ము ను వీ డు ట

601. అలసత్వ మనుపొగ దాడిసలుపుట ప్రారంభించినచో వంశ మనునిరంతరజ్యోతి యారిపోవును.

602. తమకుటుంబమును స్థిరమైన పునాదులమీద స్థాపింప దలచినవా రలసత్వము యొక్క నిజతత్త్వమును గుర్తెరిగి దానిని వర్జించుదురుగాక.

603. అలసత్వ మనుహంతకుని కౌగలించుకొను మూర్ఖుని కుటుంబము తనకంటె ముందుగనే నశించును.

604. అలసులై యుదారకార్యములకు పూనుకొనని వారి గృహములు నశించును. వారి దురాగతములకు హద్దులుండవు.

605. కాలయాపనము, మరపు, సోమరితనము, నిద్ర - ఈ నాలుగు భ్రష్టులగువారి విహారనౌకలు.

606. ఎంత రాజులయండదండలున్ననూ ఈప్రపంచములో సోమరులు రాణింపజాలరు.

607. సోమరులై యే ఘనకార్యములను చేబట్ట లేనివారు జననిందలకు, గర్హణలకు పాత్రులు కాకతప్పదు.

608. కుటుంబములో సోమరితనము ప్రవేశించెనేని యా కుటుంబము త్వరలోనే శత్రువుల చేతులలో బానిస యగును.

609. అలసత వీడిన తక్షణమే పూర్వపు కుటుంబభారము లన్నియు నశించును.

610. అలసత నెఱుగని రాజు త్రివిక్రముని రాజ్యము నంతను తన యధీనమునకు తెచ్చుకొనగలడు.

అరువదిరెండవ యధ్యాయము

## పౌరుషము

611. 'అసాధ్యము' అను నెపముతో నేకార్యమును విడిచి పెట్టకుము. ఏలనన కృషి సమస్తమును సాధింపగల సమర్థతను నీకు ప్రసాదించును.

612. ఏపనిని యసంపూర్తిగా విడువకుము. ఒకసారి ప్రారంభించిన దానిని పూర్తిచేయకుండ విడిచిపెట్టువారి నీ ప్రపంచ మాదరింపజాలదు.

613. ఎట్టి ప్రయత్నమునుండియు విరమింపని సాహసోపేతులకే సర్వప్రజలకు సేవచేయుటకును, మాహాత్మ్యము లభ్యమగును.

614. పిరికివాని చేతిలోని కత్తివలె సోమరి వదాన్యత రాణింపదు. అది శాశ్వతముగ నుండునది కాదు.

615. సుఖమును త్యజించి కృషినే వరించు మానవుడు తన బంధుమిత్రులందరకు పెట్టనికోట. అతడు వారి దుఃఖాంబువులను తుడిచివేయును.

616. పరిశ్రమయే యైశ్వర్యమునకు మూలము. సోమరి తనము దారిద్ర్యమును లేమిని తెచ్చిపెట్టును.

617. సోమరి తనమున్న గృహములో పెద్దమ్మ దిద్దిర తిరుగును. కాని లక్ష్మి యలసత్వము నెరుగని పౌరుషమున్నచోట నివసించును.

618. లక్ష్మి మానవు నొకవేళ విడిచిపోయినచో సిగ్గుపడవలసిన దేమున్నది? కాని మానవుడు బుద్ధిపూర్వకముగ కృషిని విడిచి పెట్టుట యవమానకరము.

619. దేవతలు వ్యతిరేకమైనను కూడ పరిశ్రమ వలన నీ కృషికి తగినఫలము లభించితీరును.

620. విధికి లొంగక నిరంతరకృషి చేయువారు విధినికూడ లోబరుచు కొందురు.

అరువదిమూడవ యధ్యాయము

## విపది ధైర్యము

621. విపత్తు సంభవించునపుడు దానిని చిరునవ్వుతో నెదుర్కొనుము. ఏలనన చిరునవ్వువలె నెట్టి యిక్కట్టునైన నెదుర్కొనగల ఓపిక యింకొకటి మానవునకు లభింపజాలదు.

622. చంచలమనస్సు ధృతివహించినచో దుఃఖసముద్రము యావత్తు దానియందు గోష్పదమై పోవును.

623. కష్టములనుచూచి కష్టపడనివారు కష్టములనే కష్టపెట్టి పంపివేయుచుందురు.

624. దున్నపోతువలె ప్రతికష్టము గుండ నడచిపోవుటకు ప్రతినాడిని వినియోగించు మానవునకు కష్టములు కలుగ వచ్చును. కాని వాని నతడు పరాభవించి పంపివేయును.

625. కష్టపరంపర లొకటొకటిగ మానవునిపై పడినను జంకని హృదయముకల మానవుని విఘ్నములకే విఘ్నములు సంభవించుచున్నవి.

626. అదృష్టదినములలో నుబ్బితబ్బిబ్బుకాని మానవులు 'అయ్యో! మేము నాశము చెందితిమి' అని నిర్వేదము చెందవలసిన దినము లెన్నడైనను కలుగునా?

627. శరీరము దుఃఖభాజనము అని జ్ఞాను లెరుంగుదురు. కనుక నేకష్టములు వచ్చినను వారు నిర్వేదము చెందరు.

628. సుఖమునందు సంగము లేనివాడు, కష్టములు విషయ ప్రసక్తివలన జనించు న్యాయములో నొకభాగమని గ్రహించువాడు నెట్టి విఘ్నములకు దురపిల్లడు.

629. విజయోత్సవ దినములలో సుఖములవెంట పరుగిడని వాడు విపద్దినములలో బాధపడడు.

630. ప్రయత్నములోనుండు ఆయాసాదుల నతిసంతోష ముతో స్వీకరించువాని నతని శత్రువులే స్తుతించుచుందురు.

రాజులను శీర్షికగల
రెండవభాగములోని మొదటిప్రకరణము సమాప్తము.

---

# రెండవ ప్రకరణము



రాజ్యాంగములోని భాగములు

అరువదినాల్గవ యధ్యాయము

## మంత్రి

631. గొప్పగొప్ప సాహసకార్యములను సాధింపగల మార్గములను అవకాశములను యుక్తముగ నిర్ణయింపగల వానిని వాని నేఋతువులో ప్రారంభింపవలయునో సూచించు వానిని మంత్రిగ నియమింపదగును.

632. అధ్యయనము, నిశ్చయము, పౌరుషము, ప్రజా శ్రేయముపట్ల శ్రద్ధాభక్తులు, పైసూత్రములోని లక్షణము — ఈయైదు మంత్రియొక్క యర్హతలు.

633. మిత్రభేదము, మిత్రలాభము, శత్రువులను మిత్రులుగ చేసికొనుట— ఈశక్తులు కలవాడు సమర్థుడైన మంత్రి కాగలడు.

534. ప్రణాళికలను రచించుట, వాసనాచరణలోనికి తెచ్చు సాధన సంపత్తి నిర్ణయించుట, నిశ్చితాభిప్రాయ ప్రకటనము — ఈమూడు మంత్రికుండవలసిన ముఖ్యగుణములు.

635. న్యాయశాస్త్రవిదుడు, విద్యాప్రబోధకుడు, వాక్కునందు అంతఃకరణశుద్ధి కలవాడు, ప్రతియవసరమునకు తగిన

దానినే యెల్లప్పుడు గ్రహింపగలవాడు: నీకు మంత్రిగ నుండ దగును.

636. నైజమనీషకు బహుగ్రంథావలోడనముకూడ జత కూడునేని మానవులకిక దుర్గ్రాహ్యమైన దేదియుండును ?

637. పుస్తకజ్ఞానమును నీవెంతగా సేకరించుకొనినను అనుభవ జ్ఞానముకుకూడ సంతరించుకొని తదనుగుణముగ నాచరించుము.

638. రాజు మూర్ఖుడేకావచ్చును; అతడు ప్రతియడుగులోను మంత్రిమాటలను పెడచెవిని పెట్టవచ్చును. అయినను న్యాయ మైన దానిని యుచితమైనదానిని యెల్లపుడు సూచించుచుండు టయే మంత్రికర్తవ్యము.

639. మంత్రి సభలో కూర్చొని తనరాజు నాశముకోరకే పన్నాగముపన్ను మంత్రి డెబ్బదికోట్ల శత్రువులకంటె నెక్కువ యుపద్రవకారి.

640. నిశ్చయార్థపరులు కానివారు వ్యూహములను పన్ను టలో పూర్ణత్వమునే ప్రకటింపవచ్చును. కాని దానిని నిర్వహిం చుటలో వారు జంకిపోయి తమ రచనలనెన్నడు సాధింపజాలరు.

## అరువదియొదవ యధ్యాయము

# వక్తృత్వము

641. వాక్చాతుర్యము నిశ్చయముగ గొప్ప యదృష్టము, ఆశీర్వాదము దానికదే ప్రత్యేకమైన యాశీస్సు. అది యింకొక దానిలో భాగము కాజాలదు.

642. హానివృద్ధులు జిహ్వాగుణములోనే కలవు. కనుక అవ్యక్త సంభాషణము నుండి నిన్ను నీవు రక్షించుకొనవలెను.

643. స్నేహితులను మరింత సన్నిహితము చేయుచు శత్రు హృదయములను కూడ మృదువు పరచునదియే సంభాషణ మనదగును.

644. ప్రతి పరిస్థితిని చక్కగా పరామర్శచేసి తరువాతనే యర్థవంతమైన సంభాషణ చేయుము. ఇంతకంటె పవిత్రతను, లాభమును చేకూర్చు ఘనతరవస్తు వింకొకటి లేదు.

645. నీవెట్టిసంభాషణ చేయవలెను ? ఏయితర సంభాషణ చేతను అణచివేయబడజాలని సంభాషణ చేయుము.

646. శ్రోతలు తనలో లీనమైపోవునట్లు, ఇతరుల సంభాషణ లోనిసారమును గ్రహించునట్లు చేయుటయే రాజనీతి కోవిదుని పాత్ర.

647. అదురు, బెదురులేక సంభ్రమములేక సూటిగా మాట్లాడగలవానిని వాదములో జయించు టెట్టి వారికిని సాధ్యముకాదు.

648. సుశిక్షిత క్రమముగ మాట్లాడుచు, సానునయభాష నుపయోగించు మానవుని కీప్రపంచము బానిస యగును.

649. కొద్దిమాటలలో, నేర్పుకూర్చిన సరస పదజాలములో తమ మనస్సును విశదపరచజాలని వారి కధిక ప్రసంగ కండూతి బహుళమగును.

650. నిజసముపార్జిత విద్య నితరులకు బోధింపజాలనివారు లతాగ్రమున పుష్పించియు వాసనలేని నిర్గంధ కుసుమము వంటివారు.

## అరువదియారవ యధ్యాయము

# కార్య పవిత్రత

651 స్నేహితులను చేసికొనుటవలన మానవునకు విజయము చేకూరును. కాని కార్యపవిత్రత యతని కోరికను సఫలము చేయును.

652. శాశ్వత కళ్యాణమును కీర్తిని ప్రసాదింపజాలని కార్యములనుండి సదా పరాఙ్ముఖుడవు కమ్ము.

653. ఈ ప్రపంచమున నభ్యుదయము కోరువారు తమ యశస్సును మలినపరచు సర్వకార్యములను పరిత్యజింపవలెను.

654. విషయముల కుచితగౌరవము నిచ్చువారు హతవిధులైనను నీచకార్యములకు, అవినీతిపనులకు లోనుగారు.

655. 'నేనెట్టి పనిచేసితిని?' అని కార్యాంతరము విచారించు పనుల నెవడు చేయకుండు గాక! ఒకవేళ అట్టిదేదేని చేసిన యెడల నతడు తిరిగి దానిని చేయకుండుట మేలు.

656. శిష్టులచే గర్హింపబడు కార్యముల నాకలిదప్పులలో తనను పోషించిన తల్లిని రక్షించుటకైనను చేయరాదు.

657. నీచకార్యములు చేసి కూడబెట్టబడిన యైశ్వర్యము కంటె పుణ్యాత్ముల దారిద్ర్యమే చాలమేలు.

658. నీతిశాస్త్రనిపుణులు నిందించు కార్యములను చేసినవా రొకవేళ జయమునే సాధించిన దుర్గతి చెందుదురు.

659. దుఃఖాంబుకణములమధ్య గుంజుకొనబడిన సర్వస్వము తిరిగి యేడుపులమధ్య సెలవుదీసికొనును, కాని ధర్మమార్గమున సముపార్జింపబడిన ధనము, మధ్యలో నష్టమైనను, చివరకు వృద్ధిచెందును.

660 వంచించి ధనము సంపాదింప యత్నించుట పచ్చి కుండలో నీరు నిలువ యుంచుటవంటిది.

అరువదియేడవ యధ్యాయము

## శీల నిర్ణయము

661. మహాత్కార్యములను సాధించుట యనగా వానిని సాధించుటకు కావలసిన సంకల్పములోని మహత్తు. తక్కిన విషయములన్నియు దానికి సరిరావు.

662. వ్యర్థకార్యముల నన్నిటిని వర్జించుట, విఘ్నములకు భయపడి స్వీయప్రయోజనములను మానుకొన కుండుట — ఈ రెండు మనీషావంతు లనుసరింపదగు ముఖ్యసూత్రము లని పెద్దలు చెప్పుదురు.

663. కార్యము సాధింపబడిన తరువాతనే కార్యవాది తన ప్రయోజనమును బహిర్గత మొనర్చును. ఏలనన ముందుగనే దానిని వెలిబుచ్చుచో తరింపరాని విఘ్నములు సంభవింప వచ్చును.

664. ఎవనికైనను చెప్పుట చాల తేలిక. కాని చెప్పినవిధముగా చేయుట బహు అరుదు.

665. గొప్పకార్యములుచేసి, కీర్తి గడించినవాని సేవనే రాజు అర్థించును. అట్టివానినే ప్రజలు గౌరవింతురు.

666. తమ యావచ్ఛక్తితోను సంకల్పించిన యెడల మానవులు తాము సంకల్పించినట్లే తమ కోరికలను నిర్వహింప కలుగుదురు.

667. ఏమానవుని అతనికిగల దృష్టినిబట్టి నిందింపకుము. ఏలనన మహారథచక్రమున కంటియుండు యిరుసువంటి మానవు లున్నారు.

668. నీబుద్ధి యుక్తులన్నిటిని వినియోగించి నీవొక కార్యము చేబట్టినపు డిక చంచలమనస్కుడవు గాక నీ ప్రయోజనమును శక్తికొలది సాధింపుము.

669. నీయానందమును పెంచు పనులు చేయుము. వాని నాచరించుటలో నీవు సహింపరాని క్లేశముల ననుభవింపవలసి వచ్చినను నీ హృదయమును వజ్రసన్నిభముచేసి చివరవరకు సాగింపుము.

670. శీలమును నిశ్చయించుకొనలేని మానవు లితరత్ర యెంతటి ఘనకార్యములను సాధించినను ప్రపంచము వారిని లెక్క సేయదు.

అరువది యెనిమిదవ యధ్యాయము

# వ్యవహార నిర్వహణము

671. ఒక నిశ్చయమునకు జేరుటకొరకే మంత్రాంగము సలుపవలెను. ఒక నిశ్చయమునకు వచ్చిన తరువాత కార్యాచరణము నెంతమాత్రము నాలసింపరాదు. అది దోషమగును.

672. సావకాశముగ చేసికొనవలసిన పనులను విచారణ సలిపి చేయుము. కాని తక్షణమే చర్య తీసికొనవలసిన పనుల కొక్క నిముసమైనను వాయిదా వేయకుము.

673. అవకాశములు లభ్యమైనపుడు సరాసరి పరమావధికే యత్నింపుము. కాని పరిస్థితులు వ్యతిరేకముగ నున్నపుడు తక్కువ యాటంకములుగల మార్గమునే యనుగమింపుము.

674. శత్రుశేషము, కార్యశేషము చల్లారని యగ్నికణముల వంటివి. అవి తిరిగి విజృంభించి సకాలములో మానవుని కాల్చి వేయును.

675. ప్రతి కార్యమును చేయుటలో నీ విషయపంచకమును గురించి శ్రద్ధ వహింపవలెను. (1) మనకుగల వసతులు (2) పరికరములు (3) కార్యముయొక్క స్వభావము (4) తగిన యదను (5) నిర్వహింపదగిన స్థానము.

676. మొదట దానికి చేయవలసిన ప్రయత్న మెంతయో నిశ్చయింపుము. మార్గములో సంభవించు ఆటంకము లెట్టివో కనుగొనుము. దానివలన చేకూరు లాభ మెంతయో అంచనా వేయుము. తరువాత కార్యము చేబట్టుము.

677. ఏకార్యములోనైనను విజయము పొందుటకు దానిలో నిష్ణాతులైనవారి హృదయములలో చొరబడి దాని రహస్యమును తెలిసికొనుటయే మార్గము.

678. మానవు లొక యేనుగును మరియొక యేనుగుద్వారా పట్టుకొందురు. అట్లే యొక కార్యమును మరియొక కార్యము నిర్వహించుట కాలంబముగ చేయుము.

679. నీ స్నేహితులను బహూకరించుటకంటె త్వరితముగనే నీ శత్రువులను లాలించి వారితో స్నేహము చేసికొనుము.

680. దుర్బలులు నిరంతర భయములనుండి తమ జీవితములను రక్షించుకొనుటకు ప్రయత్నింపవలయును. కనుక అవకాశము దొరకగనే వారు బలవంతునితో చెలిమి చేసికొనుట కంగీకరింపవలయును.

## అరువదితొమ్మిదవ యధ్యాయము

# రా య బా రి

681. రాయబారి కెట్టియర్హత లుండవలయును? (1) ప్రేమించు స్వభావము (2) కులీనత (3) రాజుల నాకర్షింపగల సదాచార సంపత్తి; ఇవి రాయబారికుండవలసిన లక్షణములు.

682. మరియు తన రాజుపట్ల భక్తి విశ్వాసములు సూక్ష్మగ్రహణశక్తి, వాక్చాతుర్యము - ఈమూడు దూతకు ముఖ్యావసరములు.

683. అన్యరాజ సభాంతరాళమున తన ప్రభువునకు శ్రేయము కలుగునట్లు భాషింతునని బాసయిచ్చినవాడు పండితులలో పండితుడు కావలయును.

684. ఇంగిత జ్ఞానము, పాండిత్యము, మనోజ్ఞమగు నాకారము కలవాడు దూతగానుండదగును.

685. (1) ముక్తసరి (2) మాటతియ్యదనము (3) కటువు భాషణలేమి — ఈ త్రివిధ సాధనలద్వారా దూత తన ప్రభువుకు కళ్యాణము చేకూర్చవలయును.

686. విద్య, అనునయవాక్య సరణి, ప్రత్యుత్పన్నమతి — ఈ మూడు దూత కార్యమునకు వలయు శీలసామగ్రి.

687. దేశ, కాలజ్ఞుడు, తనవిధి నెరిగినవాడు, తన పదములను తూచి మాటలాడువాడు - రాయబారులలో నగ్రగణ్యుడు.

688. దూతకార్య నిర్వహణకు స్థిరచిత్తము, హృదయ పవిత్రత, తన పద్ధతులలో ప్రవీణత యుండవలెను.

689. దుర్బల వాక్యములనుగాని, అసభ్యపదములను గాని తన పెదవులనుండి యెన్నడు వెలువడనీయని సుస్థిరచిత్తుడే వైదేశికసభలలో రాజులకు సందేశములను సమర్పింపగల సమర్థుడు.

690. మృత్యుదండనతో భయపెట్టబడినను సర్వసమర్థుడైన దూత తనవిధిని వీడడు; అతడు తన ప్రభువు కళ్యాణమును సాధించుటకే యత్నించును.

డెబ్బదియవ యధ్యాయము

# రా చ వా రి పొం దు

691. రాజులమధ్య మెలగదలచుకొనినవారు నిప్పు దగ్గర చలి కాచుకొనువారివలె సంచరింపవలయును. వారు అతి సమీపమునకా పోరాదు; అతిదూరముగను నుండరాదు.

692. రాజు కేవిషయములపై కోరిక యుండునో వాటి వంకకు పోకుండువాని కతని శాశ్వతమైన యాదరణ కలుగును; తద్వారా యతడు భాగ్యశాలి కూడ కావచ్చును.

693 నీకెట్టియవమానము కలుగకుండ గోరుదువేని గొప్ప గొప్ప తప్పిదములను వేటిని దరిచేరనీయకుము. ఒకసారి యను మానము జనించెనా దానిని పోగొట్టుట కెవరితరముకాదు.

694. గొప్పవారి సమక్షమున గుసగుసలతో గొణగకుము. వారి సమీపమున నున్నపు డింకొకరితో చిద్విలాసము లాడకుము.

695. నీకు సంబంధములేని యెట్టిసంభాషణను పొంచియుండి వినకుము. నీకు తెలియకుండ దాచబడిన విషయములను త్రవ్వుటకు యత్నింపకుము. నీకు తెలుపబడిన రహస్యమునే స్వీకరించుము.

696. రాజుయొక్క చిత్తవికారమును పరిశీలింపుము. అప్పటి కాలమును గుర్తింపుము. తరువాత నతనికి సంతృప్తికరముగ నుండు వాక్యములను హృదయంగమముగ మాట్లాడుము.

697. రాజుకు ప్రియమైన విషయములనుగురించియే చెప్పుము కాని, యతడు కోరినప్పటికి నెన్నడు నహితమైన విషయములను గురించి మాట్లాడకుము.

698. నీకంటె చిన్నవాడనియో, బంధువనియో, పక్క మనియో రాజు నెన్నడు తేలిక పరచకుము. అతని ప్రభావము నకు తగిన భయభక్తులతో ప్రవర్తించుము.

699. సంభ్రమ రహితము, నిర్మలము నగు దృష్టి కలవారు రాజమాన్యత కలదుగదా యని యెన్నడు కూడనిపనులు చేయరు.

700. రాజుతోగల పరిచయము నాధారము చేసికొని యభాగ్యపుపనులు చేయువారు నశింతురు.

డెబ్బదియొకటవ యధ్యాయము

# చూపులను బట్టి నిర్ణయించుట

701 నోటినుండి మాటరాకుండగనే మనస్సులో నున్న దానిని కనుగొనగల మానవుడు మానవలోకమునకే యలంకారము.

702. హృదయములోనున్న దానిని రూఢిగ చెప్పివేయగల వానిని దైవమువలె చూడుము.

703. చూపులనుబట్టియే మానవుని కడుపులోనున్న యుద్దేశ్యములను చెప్పివేయగల వారి కెంతయిచ్చియైనను నీ మంత్రివర్గములో జేర్చుకొనుము.

704. మాట లక్కరలేకుండగనే గ్రహింప గలవాడు అట్లు గ్రహింప లేనివారికుండు ముఖలక్షణములనే కలిగియుండ వచ్చును. కాని వారొక ప్రత్యేకజాతికి చెందుదురు.

705. చూచినంత మాత్రముచేతనే హృదయములో నున్న దానిని కన్ను కనుగొన లేకపోయినచో 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అనుమాట యెట్లు చెల్లును ?

706. స్ఫటికము తన వర్ణమును వదలి సన్నిహిత వస్తువు యొక్కవర్ణమును పొందునట్లు ముఖముకూడ మార్పుచెంది హృదయములో పొంగుచుండు భావమునే ప్రకటించును.

707. ముఖముకంటె సూక్ష్మమైన దేదికలదు? హృదయములో నున్న కోపమును లేదా సంతోషమును మొట్టమొదట వెల్లడించునది ముఖముకాదా?

708. మాటలు లేకుండగనే నీ హృదంతరాళమున నున్న దానిని గ్రహింపగల మానవుని నీవు కనుగొనునపుడు నీవతని వైపుచూచిన చాలును; నీ కోరికలు ఫలించును.

709. కంటియొక్క వికారములను జిత్తులను కనుగొన గల వారు దగ్గర నున్నచో కన్నొక్కటియే హృదయములో ద్వేషమున్నది మిత్రత్వమున్నది చాటగలదు.

710. సూక్ష్మగ్రాహులనుకొనువారిని పరీక్షించి చూతువేని వారి కన్నే వారిని చాటగల కొలబద్దయని విశదము కాగలదు.

## డెబ్బది రెండవ యధ్యాయము

# స భా వి చ క్ష ణ

711. సుశిక్షిత వక్తలారా! సుసంస్కార శోభితులారా! మీ సభాస్థారులను లెస్సగా తెలిసికొని వారి కనువగు విధమున మీ యుపన్యాసములను సంస్కరించుకొనుడు.

712. సరస్వతీవరప్రసాదులారా! మీ సభాసదుల చిత్తవృత్తిని తొలుత గ్రహింపుడు. తరువాత విచారమనస్కులై యుపన్యసింపుడు.

713. సభా స్వభావమును తెలిసికొనకుండ నుపన్యసింపగోరు వారు వక్తృత్వకళ తెలియనివారు. వారిక నేపనికి పనికిరారు.

714. మనీషావంతుల పరిషత్తులో జ్ఞానచర్చ చేయుము. కాని మూర్ఖులను రంజింపచేయవలసి వచ్చినపుడు వన్నెచిన్నెలు లేని తెల్లవస్త్రమువంటి సరళమార్గమున నడిపింపుము.

715. వృద్ధసభలో నాయకత్వము నంగీకరింపకుము. ఇట్టి యాత్మనిగ్రహము తదితరగుణము లన్నిటిని మించి వెలుగు గొప్ప గుణము.

716. జ్ఞానులుకల సభలో నవివేకప్రసంగమునకు దిగుమాన వుడు ధర్మపథమునుండి పడిపోయినవానివలె ననుభవించును.

717. విమర్శక శిఖామణులున్న సభలోమాత్రమే పండితుని విద్వత్తు అద్వితీయ శోభతో ప్రకాశించును.

718. ప్రజ్ఞగలవారి కిచ్చు మంచి సలహా జీవముగల మొలకల వ్రేళ్ళలో నీరుపోసి దోహదము చేయుట వంటిది.

719. మీ యుపన్యాసము సజ్జనులు విని 'వహ్వా, వహ్వా' అని స్తుతిచేయగోరు వక్తలారా! పొరపాటుననైనను మూర్ఖుల సభలో నుపన్యసింపకుడు.

720. నీకు వ్యతిరేకులుగా నున్నవారి సభలోచేయు ప్రసంగము మురికినేలమీద చల్లు అమృతము వంటిది.

డెబ్బదిమూడవ యధ్యాయము

# సభలలో ఆత్మవిశ్వాసము

721. వక్తృత్వ కళను సముపార్జించి సుసంస్కారవంతులైన వారు తమ యుపన్యాసక్రమమును చక్కచేసికొని పండిత సభలలో నెన్నడు భంగపడరు.

722. విద్వత్పరిషత్తులో తన సిద్ధాంతములను నిలుపుకొనగల ధీరుడే పండితులలో పండితుడు.

723. యుద్ధరంగములో మృత్యువునెదుర్కొన గలవారు సామాన్యులు. కాని కంపములేకుండ సభలలో మాట్లాడగల వా రతి యరుదు.

724. నీవు క్షుణ్ణముగ తెలిసికొనిన దానిని పండితులమధ్య నిర్భయముగ మాట్లాడుము. నీకు తెలియని దానిని అందు పారంగతులైనవారివలన నేర్చుకొనుము.

725. తర్కశాస్త్రములో ప్రవీణుడవు కమ్ము. ఏలనన నెట్టి సభలోనైనను నిర్భయముగ మాట్లాడుట కది ముఖ్యము.

726. చేతిలోశక్తిలేనివారి కాయుధములుండి లాభమేమి? ప్రబుద్ధులైనవారి సభలో మాట్లాడవెరచువారికి పుస్తకములున్న ఫలమేమి?

727. యుద్ధరంగ మధ్యమున నపుంసకుని చేతిలోనున్న కత్తి కెంతవిలువ యుండునో సభలోమాట్లాడలేనివాని పాండిత్యమునకు నంతియే విలువయుండును.

728. విద్వత్సభలో తమయభిప్రాయములను హృదయము లకు హత్తుకొనునట్లు చెప్పలేనివారు బహువిధ మేధావంతు లైనను నిష్ప్రయోజకులే.

729. విద్యయుండియు విద్యాధనుల సభలో మాట్లాడ వెరచువారు విద్యావిహీనులకంటెను నికృష్టులనియే భావింప బడవలయును.

730. తామభ్యసించిన దానిని సభలో నిలిచి నిర్భయముగ నుద్ఘాటింపలేనివారు ప్రాణవంతులయ్యు చచ్చినవారికంటె నుత్తములు కాజాలరు.

డెబ్బదినాల్గవ యధ్యాయము

# రాష్ట్రము

731. సస్యసంపదలతో సదా తులతూగునది, ఋషుల కాల వాల మైనది, రసజ్ఞులైన ధనికులుకలది యేదికలదో అదియే గొప్ప దేశము.

732. ఏ దేశము తన యైశ్వర్యగరిమచే ప్రజల ప్రేమను చూరగొనునో, కీటకాదులచే బాధితము కాకపోవుటచే సస్య సమృద్ధితో ప్రజలను తనుపుచుండునో యదియే గొప్ప దేశము.

733. దేనిని గొప్పజాతి యనదగును? భారపరంపరలచే నణచివేయ బడుచున్నను ఏది తనప్రజల నతిధైర్యముగ భరిం

చునో, తనవన్నుల నేది నిశ్శేషముగ చెల్లించునో యదియే గొప్పజాతి.

734. కరువు కాటకములు లేనిది, ఆధివ్యాధుల నెరుగనిది, శత్రుదాడులనుండి సురక్షితమైనది గొప్ప దేశ మనదగును.

735. పరస్పర కక్షులతో భిన్నాభిన్నము కానిది, హాత్యాకాండలతో విహరించు అరాజకులు లేనిది, తల్లిగర్భమును చెండాడు దేశద్రోహులు లేనిది గొప్పజాతి యనబడును.

736. శత్రువులచే నెన్నడు నాశము గావింపబడనిది, అట్టిది తటస్థించినను లేశమాత్రము తన సమృద్ధిని కోల్పోనిది ప్రపంచ దేశములలో రత్న మనదగును.

737. వాపీకూప తటాకములు, ఋతువర్షములు, సమ్యక్ స్థిత పర్వతములు, అభేద్యములగు దుర్గములు — ఇవి ప్రతిదేశము నకు నుండవలసిన ప్రధానసపందలు.

738. ధనము, సస్యసంపద, ప్రజాసుఖము, రోగరాహిత్యము, శత్రుదాడులనుండి విముక్తి - ఈ యయిదు రాజ్యమున కలంకారములు.

739. ప్రజలు శ్రమపడకుండ పుష్కలముగ పండు దేశమే దేశము. శ్రమించినమీదటనే పండు దేశ మొక దేశమే కాదు.

740. పూర్వోక్త సంపదలన్నియు కలిగినను తగిన పాలకుడు లేని దేశము నిరర్థకము.

డెబ్బదియైదవ యధ్యాయము

# దుర్గములు

741. తమ రక్షణనుగురించి యోచించు దుర్బలులకు మాత్రమే కాక బలవంతులకును శక్తివంతులకును కూడ దుర్గములు సహాయపడును.

742. నదులు, యెడారులు, పర్వతములు, సాంద్రారణ్యములు - పలువిధ రక్షణక్షేత్రములు కాగలవు.

743. దుర్గము లేవిధముగనుండవలెనని శాస్త్రము శాసించుచున్నది? ఔన్నత్యము, సాంద్రత, స్తంభరూపము, అభేద్యత — ఈ నాలుగుకోటల కుండవలసిన లక్షణములు.

744. విశాలవంతముగనుండి యతితక్కువ మర్మస్థానములు కలిగి, శత్రుదాడులను సహింపగలిగినదియే దుర్గశ్రేష్ఠము.

745. లోపల సైన్యమునకు రక్షణావకాశములు, అభేద్యత, సంభారసమృద్ధి — ఈ మూడు కోట కతిప్రధాన విషయములు.

746. అన్నిరకముల దినుసులతోను నిండియుండునది, అతి ధైర్య సాహసములతో పోరాడగల రాజభక్తిగల వీరులు కలదియే నిజమైన దుర్గము.

747. నిరంతర దాడులకుగాని, ముట్టడికిగాని, ద్రోహమునకు గాని లొంగనిదే నిజమైన కోట యనదగును.

748. ముట్టడించు వారెంతటి పౌరుషము ప్రదర్శించినను వారి నోడించు శక్తిని సైన్యమునకు ప్రసాదించునదియే యథార్థమైన దుర్గము.

749. బహువిధోపాయములచేత నభేద్యము కావింపబడి బహిఃప్రాకారములోనే శత్రువును త్రుంచివేయగల శక్తిని ప్రసాదించునదియే దుర్గము.

750. కాని కోటయెంత బలమైనదైనను దాని సంరక్షకులు సమరతంత్ర శక్తిని ప్రదర్శింపలేని యెడల యంతయు నిరర్థకమే యగును.

డెబ్బదియారవ యధ్యాయము

# ధ నా ర్జ న

751. శుంఠలకు ధనములేని ప్రాముఖ్యత తెచ్చిపెట్టును. అన్ని గుణములు బంగారము నాశ్రయించును.

752. పేదలను చూచి యందరు నసహ్యించుకొందురు. ధనవంతుని ప్రతిమానవుడు నాకసము వరకు పొగడుచుండును.

753. ఐశ్వర్యమను చలింపని వెలుతురు చీకటి తెరవుల నన్నింటిని జ్యోతిర్మయము గావించును.

754. ధర్మా విరుద్ధముగ సంపాదింపబడిన యర్థము వలన నైహికాముష్మిక సుఖములు రెండు సమకూరుచున్నవి.

755. దయాసత్యశౌచ విరహితముగ సంపాదింపబడిన ధనమును నీ చేతులతో తాకకుము; ప్రేమింపకుము.

756. కలుపుకొనుట చేతను, శిక్షార్థముల మూలమునను, సుంకముల వలనను, యుద్ధభూమిలో గెలుచుకొనబడుట చేతను రాజు భాండాగారము వృద్ధిచెందును.

757. భూతదయకు ప్రేమయే జనయిత్రి. దానిని దోహదము చేయుటకు ధనమను దయార్ద్రమైన ధాత్రియవసరము.

758. ఐశ్వర్యవంతు డెట్టి సాహసకార్యము తలపెట్టినను పర్వత శిఖరాగ్రమున కూర్చొని మదకరియుద్ధము వీక్షించువాని చందమున నుండును.

759. ధనమును సముపార్జింపుము. ఏలన నీ శత్రువు గర్వభంగము నొనర్చుటకు దానిని మించిన యాయుధమే లేదు.

760. న్యాయమార్గమున ప్రభూతధనమును సముపార్జించిన వానికి తక్కిన ధర్మకామములు రెండును నెరవేరుచున్నవి.

డెబ్బదియేడవ యధ్యాయము

## సైన్య లక్షణములు

761. ఎట్టియుపద్రవమునైనను సరకుగొనని సుశిక్షిత వీర భటాళియే రాజుకుండవలసిన ప్రథమధనము.

762. కరకుకరవాలములు కుత్తుకలుకోయుచుండ నిరాశా జనక పరిస్థితులలో ముక్కలుతీరిన పురాతన రాజభటులొక్కరే వజ్రసంకల్పముతో నిలువగల ధీరులు.

763. ఎలుకలు సముద్ర ఘోషవలె గర్జించినను లాభమేమి? కోడెత్రాచు బుసకొట్టినంత మాత్రముచేతనే యెలుకల పటాలము పటాపంచలగుచున్నది.

764. పరాజయము నెరుగనిది, లంచపంచములచేత నవి సీతి పాలుకానిది, యనేక యుద్ధరంగములలో నార్జించిన పరాక్రమ సాంప్రదాయములచే నలరారునదియే సైన్యమనదగును.

765. మృత్యుదేవుడే భయంకరావతారమునెత్తి దండెత్తి వచ్చినను వానిని నిర్భయముగ నెదుర్కొనగల దానినే సైన్యమని పిలువదగును.

766. పరాక్రమము, గౌరవము, వ్యాకుల పరిస్థితులలో స్థైర్యము, అకలంకయుద్ధసాంప్రదాయ సిద్ధాంతములపై భక్తి విశేషము - ఈ నాలుగు సైన్యమును రక్షించు కవచములు.

767. సైన్యమని పిలువదగినది సదాశత్రువుకొరకే పరుగిడుచుండును. ఏలనన శత్రువెప్పుడు వచ్చినను జయింపగల మను విశ్వాసము దాని కెప్పుడు నుండును.

768. సైన్యమునకొక వేళ కొరవ, స్థైర్యము కొరవ యైనను ఆయుధసంపత్తి విశేషముగనున్నచో జయము చేకూరవచ్చును.

769. సైన్యము సంఖ్యాబలములో తీసిపోక, అంతః కలహములతోను, పరస్పర ద్వేషములతోను, అసూయలతోను చిందరవందరగాక, జీత భత్యముల లోపముచే మాడక సుస్థితిలో నున్నచో అది సదా జయించును.

770. సంఖ్యయెంత గొప్పదైననూ దానిని నడిపించు నాయకులు, ప్రధానులు లేనిచో అది సైన్యమే కాదు.

డెబ్బదియెనిమిదవ యధ్యాయము

## యోధుని ఆత్మవిస్మృతి

771. ఓ శత్రువులారా! యుద్ధరంగములో నా యజమాని నెదిరింపకుడు. ఇంతవర కతని నెందరో యెదిరించిరి. వారందరు నేమైరి? నేడు వారు కేవలము రాతివిగ్రహములుగ మాత్రమే నిలిచియున్నారు.

772. కుందేలునొక బాణముతో కొట్టిపడగొట్టుటకంటె మదకరీంద్రముపై ధనుష్టంకారముచేసి గురితప్పినను యశమే ప్రాప్తించును.

773. గుక్కతిరుగకుండ శత్రువును చావగొట్టు భయంకర ధైర్యమునే పరాక్రమమందురు. కాని పడిపోయినవాని చేతికి కత్తి యందిచ్చుట కేవలము వీరపురుషోచిత యుదారధర్మము.

774. యోధుడు గజేంద్రముపై బల్లెము జొనిపి మరియొక దానికొరకు చూచుచుండును. ఇంతలో నా బల్లెము తనయొడిలోనే గుచ్చుకొని పోవుటను చూచి యతడతియుల్లాసముతో దానిని పెరికివేయును.

775. తనమీద నాయుధము విసరబడినపుడు యోధుడు రెప్పవాల్చుట సిగ్గుకరము కాదా ?

776. తన శరీరము తీవ్రగాయములకేనాడు గురికాదో యాదినము దుర్దినమని యోధుడు భావించును.

777. తమ ప్రాణముల కొరకు లెక్కసేయక ప్రపంచమంతట విస్తరించు కీర్తికొరకే కాంక్షించువారి పాదకముల మంజీరమే కనుల పండువు.

778. యుద్ధరంగములో తమ ప్రాణముల కొరకు భయపడనివారు సైన్యాధిపతి వారించుచున్నను తమ ప్రాణములను తృణప్రాయముగ విడిచిపెట్టు సైనిక ధర్మమును మరువజాలరు.

779. తాము సాధింపబూనిన యాశయము కొరకు ప్రయత్నించుటలో ప్రాణములు కోల్పోయినవారిని నిందించుటకెవరికి హక్కు కలదు ?

780. తనసైన్యాధిపతి కన్నీరు కార్చురీతిగా మరణింపగలవాడు ముష్టెత్తియైనను అట్టిమృత్యువును సాధింపవలయును.

ఎనుబదితొమ్మిదవ యధ్యాయము

# మైత్రి

781. ఈ ప్రపంచములో మైత్రిని సంపాదించుటంతటి కష్టమైన దింకొకటి యేదికలదు ? శత్రువుల కుట్రలనుండి రక్షించుటకు దానితో సమానమైన కవచమేది కలదు ?

782. సజ్జనమైత్రి శుక్లపక్ష చంద్రకాంతివలె వృద్ధిచెందును. మూర్ఖుల మైత్రి కృష్ణపక్ష క్షపాకాంతివలె క్షీణించి పోవుచుండును.

783. సజ్జనుల సహవాసము ఉత్కృష్ట గ్రంథపఠనము వంటిది. నీవు వారిని సమీపించినకొలది వారిలో నవనవమైన రమ్యత ద్యోతక మగుచుండును.

784. స్నేహము వినోదముకొరకు కాదు. త్రోవ తప్పిన వారిని మందలించుటకు, నిరోధించుటకు నది యుద్దేశింపబడినది.

785. అతిపరిచయము, అతి సహవాసము అనవసరములు. హృదయ సమ్మేళనమే స్నేహ బంధమును దృఢతరముగావించును.

786. ముఖముమీద నవ్వునటించునట్టి సహవాసము మైత్రి కాజాలదు. హృదయమును రంజింపజేయు ప్రేమయే మైత్రి.

787. దోషమునుండి నిన్ను తప్పించువాడు, న్యాయమార్గ మును చూపువాడు, దుఃఖములో నీసహాచర్యమును విడువని వాడు——ఈ గుణత్రయము కలవాడే నీస్నేహితుడు.

788. బట్టతొలగినపుడు నీ చేయి యెంతత్వరగ నీ యవ యవములను కప్పివేయునో యంతత్వరగ నీదుఃఖములో నీ సేవ దీర్చువాడే యథార్థస్నేహితుడు.

789. మైత్రి యెచ్చట రాజ్యముచేయును? ఎచ్చట రెండు హృదయము లనన్యస్థితిలో కలిసిపోయి సాధ్యమైన ప్రతిమా ర్గముద్వారా పరస్పరౌన్నత్యము చేకూర్చునో యచ్చటనే మైత్రి తనదర్బారు స్థాపించును.

790. "నేను వానినంతవరకే ప్రేమింతును, వాడు నన్నింత వరకే ప్రేమించును" అను మైత్రిలో హైన్యకప్రవృత్తియేకలదు.

ఎనుబదియవ యధ్యాయము

# ఎవరు స్నేహపాత్రులు

791. మొదట శోధింపకుండ స్నేహము చేయుటకంటె గొప్ప దోషము వేరొకటి లేదు. హృదయము కలవా డొక సారి చెలిమిచేసినచో నిక విడిచిపెట్టుటయనునది యుండనేరదు.

792. ముందుగ పరిశోధింపకుండ చేయు మైత్రివలన మాన వుడు చేజేతుల అనర్థములను తెచ్చిపెట్టుకొని చివరకు మృత్యు వునే యాహ్వానించినవా డగును.

793. నీ వెవరి స్నేహము కోరుదువో వారి వంశచరిత్రను గురించి, వారి గుణదోషములను గురించి, వారి బంధుమిత్ర కళత్రాదులను గురించి లెస్సగా తెలిసికొని స్నేహము చేసి కొనుము.

794. సద్వంశజాతుడు, అపఖ్యాతి నోర్వనివాడునగు వాని స్నేహము నవసరమైనచో ధనమిచ్చియైన సంపాదింపవలెను.

795. జ్ఞానుల మార్గముల నెరిగినవారిని, నీవు తప్పుచేసి నపుడు నిన్ను మందలింపగలవారిని వెతికికొని వారి స్నేహము చేయుము.

796. దురదృష్టములోను దుఃఖములోనుకూడ నొక గుణము కలదు. ఏలనన నది స్నేహితుల భక్తిని కొలవగల మాన దండము.

797. మానవునకు సంభవింపగల గొప్ప యదృష్టమెద్ది? మూర్ఖుల స్నేహమునుండి ముక్తి పొందుటయే!

798. నిష్ఫలములైన హృదయస్థైర్యమును భంగపరచునట్టి కార్యములను చేబట్టకుము. నీవు పడిపోవుటతోడనే నిన్ను విడిచి వేయువారి స్నేహము చేయకుము.

799 దుఃఖకాలములో నిన్ను ద్రోహము చేయువారి స్నేహము తలచుకొనినపు డవసానకాలములోకూడ అది నీ హృదయమును దహించును.

800. పవిత్రులైనవారి స్నేహము నాప్యాయతతో దోహదము చేసికొనుము. నీవు చెలిమిచేయుకగనివారి సంపర్కముచు ధనమిచ్చియైనను విడిపించుకొనుము.

ఎనుబదియొకటవ యధ్యాయము

# సాన్నిహిత్యము

801. ప్రేమించువారు తీసికొను స్వాతంత్ర్యముల నన్నిటిని జంకుగొంకులు లేకుండ ప్రసాదింపగల మైత్రియే సాన్నిహిత్యము.

802. యథార్థ మైత్రియననేమి? పరస్పరము స్వేచ్ఛగను, సులభ లభ్యముగను నుండుటయే! సజ్జను లెన్నడునట్టి స్వేచ్ఛ నిరాకరింపక పోవుట వారి స్వభావము.

803. మైత్రిరీత్యా తీసికొనబడు స్వేచ్ఛ కంగీకరింపని చిర మైత్రివలన ప్రయోజన మేమి?

804. స్నేహితులు తమకుగల సాన్నిహిత్యము పురస్కరించుకొని యనుమతి లేకయే యేదేని చేయునపుడు సహృదయులు వారి ప్రేమనే మదినెంచి దానిని సద్భావముతో నాదరింతురు.

805. స్నేహితులు నీకు నొప్పి కలిగించు పనిని చేతురను కొనుము. నీతో ననన్యభావము ననుభవించుటచేతనో తెలియకనో వారట్లు చేసిరని భావింపుము.

806. పూర్ణమిత్రుడు తన నాశమునకే కారణుడైనను తన ప్రాణమిత్రుని విడువజాలడు.

807. తరచు తన కపకారమే చేయుచుండినను తాను చిరకాలము ప్రేమించిన వానిని సజ్జనుడవజ్ఞ సేయచాలడు.

808. తమ ప్రాణమిత్రునిపై చేయబడు నెట్టి నిందనైన విననొల్లనివా రుందురుకదా! అతడు వారి కపకృతి చేయుదినమే పర్వదినముగ భావింపబడును.

809. ఇంకొకనిని అమర్త్య ప్రేమతో ప్రేమించు మానవుని లోకమంతయు సమ్మానించును.

810. తమ పాతస్నేహితులపై గల ప్రేమను సడలింపని వారిని శత్రువులుకూడ సౌహార్దముతో చూతురు.

ఎనుబది రెండవ యధ్యాయము

# అపకృతి చేయు మైత్రి

811. హృదయములో ప్రేమలేక ప్రేమచేత మిమ్ము మ్రింగివేయువారివలె కాన్పించువారి ప్రేమ వృద్ధియగు నాటికంటె క్షీణించునాడే మధురముగ నుండును.

812. తమకు లాభకరముగనుండు దినములలో నీ వెంట తిరుగుచు నీవలన ప్రయోజనము లేనపుడు నిన్ను త్యజించు అధముల స్నేహము నీకున్ననేమి లేకున్ననేమి?

813. స్నేహితునివలన తమకెంతలాభము చేకూరునో లెక్క వేయువారు గణికజాతిలోను దొంగలజాతిలోను చేరినవారు.

814. యుద్ధరంగములో తన రౌతును పడగొట్టి పారిపోవు గుఱ్ఱము లవంటి మానవులు కలరు. అట్టివారు స్నేహితులగుట కంటె మన మేకాకిగ నుండుటయే మేలు.

815. విశ్వసించు మిత్రుని ఆపత్కాలములో విడిచివేయు దుర్మార్గుల స్నేహముండుట కంటె లేకుండుటయే మేలు.

816. మూర్ఖులతోడి పరిచయముకంటె బుద్ధివంతులతో వైరము పెట్టుకొనుట పదిలక్షలరెట్లు యోగ్యము.

817. స్తోత్రపాఠకుల యొక్కయు, కుటిలస్నేహితుల యొక్కయు స్నేహముకంటె శత్రువులవగ కోటిరెట్లు గుణమైనది.

818. నీవు సాధింపగల కార్యము నిర్వహించువేళ నీ కాటంకము కల్పించువారితో నొక్కముక్కయైనను చెప్పక వారి స్నేహము క్రమక్రమముగ విడిచి పెట్టుము.

819. నోటితో నొకటి చెప్పుచు క్రియలో వేరొకటిచేయు స్నేహము కలలో కూడ తలంపకుము.

820. ఇంటివద్ద గదిలో తియ్యగమాట్లాడుచు సభలలో నిందా గర్భముగ పలుకు దుర్వినీతుల నెంతమాత్రము దరికి చేరనీయకుము.

ఎనుబదిమూడవ యధ్యాయము

# కపటమైత్రి

821. శత్రువుయొక్క కృత్రిమప్రేమ అవకాశము దొరకి నపుడెల్ల నిన్ను సుత్తితో బాదుట కుపయోగించు నమ్మోట దిమ్మమాత్రమే యని గ్రహింపుము.

822. మిత్రులవలె కాన్పించుచు హృదయములలో ప్రేమించుకొనని వారి ప్రేమ స్త్రీ చిత్తమువలె చపలమైనది.

823. శత్రు వెంత చదువుకొన్నవాడైనను, ఎంత దైవచింత కలవాడైనను హృదయములో నున్న ద్వేషమును పోగొట్టు కొనుట యసాధ్యము.

824. ముఖముమీద చిరునవ్వు నటించుచు హృదయము లలో ద్వేషమును దోహదము చేయు వంచకులైన దుష్టులను దూరములో నుంచుము.

825. హృదయములో నిన్ను ప్రేమింపనివారి మాటలు నిన్ను మోహింపజేసినను, వాటియందావంతయు విశ్వాస ముంచకుము.

826. మిత్రునివలె శ్రేనెమాటల నెంతగా కురిపించినను శత్రువు నిముసములో పట్టుపడి పోవును.

827. శత్రువుమాటలలో నెంత వంగినట్లు కనిపించినను నమ్మకుము. ఏలనన వంగినవిల్లు అపాయమును తప్ప మరి దేనిని సూచించుటలేదు.

828. దొంగ స్నేహితుని హస్తప్రణామములోకూడ నొక యాయుధము దాగియుండును. అతని కన్నీటిధారలనైనను ఎక్కువగా విశ్వసింపకుము.

829. బహిరంగములో నిన్ను స్తుతించుచు రహస్యముగ నిన్ను అపహాసించువారిని పైకి బుజ్జగించుచు మిత్రాలింగనములోనే నలిపివేయుము.

830. మిత్రునివలె నటించు వానితో బహిరంగముగ తల పడుట కింకను సమయము కాదేని నీవుకూడ పైకి స్నేహామునే నటించుచు నీ హృదయములోమాత్ర మతనిని దూరములోనే యుంచుము.

ఎనుబదినాల్గవ యధ్యాయము

# అ వి వే క ము

831. అవివేకమనగా నేమియో తెలియగోరెదవా? ఏది శ్రేయోదాయకమో దానిని త్రోసివేసి యుపద్రవ కరమైన దాని కంటిపెట్టుకొని యుండుటయే యవివేకము.

832. హృదయము నపవిత్ర కార్యములలోనికి నీచకార్యములలోనికి దింపుటకంటె నవివేక మింకొకటి లేదు.

833. అవివేకి ధర్మములను నిర్లక్ష్యము చేయును. మోటుదనము వహించును. సిగ్గుబిడియములను ఖాతరు చేయడు;

దోహదము చేసికొనవలసిన దానిని దేనిని దోహదము చేసికొనడు.

834. ఒక పండితుడు, సూక్ష్మగ్రాహి. ఇతరుల కుపదేష్ట కలడు. కాని యితడు తన రాగద్వేషములకు తానుమాత్రము బానిసగనే యుండును. ఇంతకంటె మూర్ఖుడింకొకడు లేడు.

835. అవివేకియొక్క జన్మలోనే యేడు పురుషాంతరముల వరకు నరకకూపములో పడియుండు నట్లు చేసికొనగల వరప్రసాది.

836. అవివేకి యేదేని ఘనకార్యము చేబట్టునేని దానినతడు పాడుచేయుటయే కాక అరదండములను కూడ సంపాదించు కొనగలడు.

837. అవివేకికి కర్మముజాలక గొప్పయదృష్టము పట్టునేని యది యితరులకు విందు; అతని బందుగులకు మాత్రము పస్తు కాగలదు.

838. అవివేకి కేదేనివిలువగలది చేకూరునేని యతడు పిచ్చివానివలె బుఱ్ఱతిరుగుడు పనులనే చేయుచుండును.

839. అవివేకులస్నేహమతి వినోదకరమైనది. మనము వారికి స్వస్తి చెప్పవలసి వచ్చినపుడు వ్యథచెంద వలసిన దేమియు నుండదుకదా!

840. సజ్జనుల సభలో మూర్ఖుడు ప్రవేశించుట పట్టుపరుపుల మీద బాడికాలుతో త్రొక్కుట వంటిది.

ఎనుబదియైదవ యధ్యాయము

# దురహంకారముచే కలుగు మూర్ఖత

841. జ్ఞానదారిద్ర్యమే నిజమైన దారిద్ర్యము. ప్రపంచము తక్కిన దారిద్ర్యమును దారిద్ర్యముక్రింద పరిగణింపదు.

842. మూర్ఖుడు తన స్వబుద్ధిచేత నేదేని ప్రసాదించునేని యది దానిని పొందినవాని యదృష్టముతప్ప మరేమియుకాదు.

843. మూర్ఖుడు తన నెత్తిమీదకు తెచ్చిపెట్టుకొను కష్టముల నతని శత్రువులుకూడ కలిగింపజాలరు.

844. మెట్టతెలివి యన నేమియో తెలిసికొన గోరెదవా? "నేను తెలివైనవాడను" అని తనకు తాను చెప్పుకొను గర్వమే.

845. తనకు లేనిజ్ఞానమునునటించు మూర్ఖుడు చివరకు తనకు నిజముగ తెలిసిన విషయములలోకూడ శంకలను లేవదీయును.

846. తనమనస్సు యొక్క వికారములను చక్కజేసికొనని మూర్ఖునకు శరీరావయవములను కప్పుకొనినంత మాత్రముచే ఒలికిన దేమికలదు?

847. తనహృదయములో రహస్యమును దాచుకొనగల గంభీరత లేనివాడు తననెత్తిమీదకు తానేదుఃఖములను తెచ్చి పెట్టుకొనును.

848. ఏది ధర్మమో తనకు తెలియదు. ఇతరులు చెప్పిన మంచిసలహా వినడు. అట్టివాడామరణాంతము తన బంధుగులకు పెద్దరోగము వంటివాడు.

849. మూర్ఖుని నేత్రములను విప్పుటకు ప్రయత్నము చేయువాడు తానే మూర్ఖుడగును. ఏలనన మూర్ఖుడొక్క విధముగ మాత్రమే చూడగలడు. వాని దృష్టిలో నది యెన్నడు తప్పు కాజాలదు.

850. ప్రపంచమంతయు "ఔను" అను దానిని కాదని నిరాకరించువాడీ భూమిమీద సంచారముచేయు దుష్టపిశాచి యని భావింపబడును.

## ఎనుబదియారవ యధ్యాయము

# ధి క్కా ర త త్త్వ ము

851. ధిక్కారముచేయు తత్త్వము మానవు లందరిలోను ద్వేష మను దుస్స్వభావమును దోహదముచేయు దుష్టరసము.

852. నీతో బుద్ధిపూర్వకముగ కలహము పెట్టుకొనుటకు నీ యిరుగువాడు నీ కపకారము చేసినను, నీ వతనిపై పగబూనకుము. ప్రత్యుపకారము చేయుము.

853. ఇతరులతో కలహము పెట్టుకొను స్వభావ మొకతీరని వ్యాధివంటిది. మానవుడు దానినుండి విముక్తి చెందుచో శాశ్వత సౌఖ్యము ననుభవించును.

854. ధిక్కార స్వభావమను మహాదోషమును నీహృదయమునుండి పారద్రోలుదువేని పరమసౌఖ్యములు నీ కందుబాటులో నుండును.

855. శత్రుత్వమును నిర్మూలించు శక్తిగలవానిని పడగొట్టవలెనని యెవడు కోరగలడు?

856. తన యిరుగుపొరుగును ధిక్కరించుటలో నానందించువా డచిరకాలములలోనే కూలిపోవును.

857. ద్వేషస్వభావముకలిగి నిరంతరకలహాసక్తియైన వాడు జాతుల యభ్యుదయమును ప్రసాదించు నీతిశాస్త్రముపట్ల యంధుడగును.

858. కలహమును నిర్మూలించుట యైశ్వర్యమునకు బాట. అట్లుకాక దానిని పెరుగనిచ్చినచో వినాశము వెన్నంటుట తథ్యము.

859. అదృష్టము పట్టనున్నపుడు మానవుడు కోపమున కెంతమాత్రము నెడమీయడు. కాని విధి వినాశమును శాసించినపుడు మానవుడు తన యిరుగు పొరుగును ధిక్కరించుటలో హద్దులను పరిగణింపడు.

860. ధిక్కారమునుండి ద్వేషము ప్రభవించును. శుభేచ్ఛ సుఖశాంతులను పరమఫలమును ప్రసాదించును.

ఎనుబదియేడవ యధ్యాయము

# శత్రువుల లక్షణములు

861. నీకంటె శక్తివంతులైన వారితో పోరాడకుము. నీకంటె దుర్బలులైనవారిపై క్షణ మూరకుండక పోరు సాగింపుము.

862. మిత్రులులేక, తనంతతా నొంటరిగనిలుచు సామర్థ్యము లేక, క్రూరచిత్తుడై యుండు రాజు తన శత్రుసైన్యముల దాడుల నెట్లు భరింపగలడు ?

863. ధైర్యమూ లేదు. బుద్ధియూ వినష్ట మయ్యెను. ఉదారతయూ శూన్యము. తన యిరుగుపొరుగులతోడనూ శాంతముగ జీవింపడు. అట్టి రాజు తన శత్రువులకు సులభభోజనమగు ననుటలో నాశ్చర్య మేమున్నది ?

864. నిరంతరము కోపస్వభావము కలవాడై, తన వాక్కును బంధింపలేని రాజు సర్వదా, సర్వప్రదేశములందు, సర్వప్రజలకు సులభభోజన మగుచున్నాడు.

865. యుక్తి యెంతమాత్రము లేనివాడు, గౌరవ మర్యాదలను సరకుచేయనివాడు, రాజనీతి శాస్త్రమును నది విధించు విషయములను నిర్లక్ష్యము సేయువాడు నగు రాజు తన శత్రువులకు సంతోషకారి యగుచున్నాడు.

866. లోభమోహాదులకు దాసుడై క్రోధాంధతచేత వివేకమును కోల్పోయిన రాజుయొక్క శత్రుత్వము నతని శత్రువులే యాహ్వానము చేతురు.

867. ఒక వ్యూహమును తలపెట్టి దాని విజయమున కుపకరింపని పనులను చేయుచుండు రాజునకు లంచమిచ్చియైనను నతని శత్రుత్వమును సంపాదింపవలెను.

868. గుణము లేవియులేక ననేక దుర్మార్గములకు లోనైన రాజుకు స్నేహితు లుండజాలరు. కనుక నతని శత్రువులు దానికి సంతసింతురు.

869. పిరికిపందను మూర్ఖుని యెదుర్కొనవలసి వచ్చినపుడు శత్రువుల కది యత్యంత ముదావహముగ నుండును.

870. తన ప్రక్కనున్న వివేకహీనుడైన రాజుతో పోరి సులభముగ విజయమును సాధింపబూనని రాజును కీర్తి యెన్నటికి వరింపజాలదు.

## ఎనుబది యెనిమిదవ యధ్యాయము

# శత్రునాశము

871. కేవలము వేళాకోళమున కైనను శత్రుత్వ మను పాపిష్ఠివస్తువును బుద్ధిపూర్వకముగ వరింపరాదు.

872. విల్లు మొదలగు ఆయుధములు కలవారిని సవాలు చేసిన చేతువుగాక, తన నాలుకయే యాయుధముగ నుండు వారిని రెచ్చగొట్టకుము.

873. మిత్రులెవరును లేకపోయినను అనేకమంది శత్రువులతో సవాలుచేయు రాజు పిచ్చివానికంటె నెక్కువ పిచ్చివాడు.

874. శత్రువులను మిత్రులుగ మార్చివేయుగల యుక్తి కల రాజు శక్తియంతము లేకుండ శాశ్వతముగ వృద్ధిచెందును.

875. నీ వేకాకిగ నిద్దరు శత్రువులతో పోరవలసివచ్చుచో వారిలో నొకనిని నీవంకకు త్రిప్పుకొనుటకు ప్రయత్నము చేయుము.

876. నీ యిరుగువానిని మిత్రుడని లేక శత్రువని నిశ్చయించినను నీవు విషమావస్థలోనున్నపు డట్టిదేమియు చేయక వానిని వానికే విడిచిపెట్టుము.

877. నీ కష్టముల నెరుగనివాని ముందు వాటిని చాటకుము. నీశత్రువులకు నీ దుర్బలత్వములను ప్రకటింపకుము.

878. చక్కని వ్యూహము పన్నుము. నీసర్వశక్తులను కేంద్రీకరింపుము. నీ రక్షణలను సమకూర్చుకొనుము. ఇట్లు చేసిననాడు నీశత్రువుల గర్వము భంగమగుట కెంతకాలమో పట్టదు.

879. కంటక వృక్షములను మొలకలుగ నున్నపుడే కొట్టివేయుము. ఏలనన మ్రానులైనచో నవి వాటిని కొట్టుటకు ప్రయత్నించు చేతినే కోసివేయును.

880. తమ్ము ధిక్కరించువారి గర్వము నడంపజాలనివారు నిశ్చయముగ చిరకాలము వర్ధిల్లజాలరు.

ఎనుబదితొమ్మిదవ యధ్యాయము

## నీ శి బి ర ము లో ని ద్రో హి

881. ఆరామములు జలాశయములు కూడ రోగమునే యుత్పత్తిచేయుచో సంతోషము కలిగింపజాలవు. అట్లే బంధుగులును మననాశమునే యన్వేషించుచో సహింపరాని వారే యగుదురు.

882. ఒరనుండి తీయబడిన కత్తివలె బహిరంగమగు శత్రువుకు భయపడకుము. కాని స్నేహితునివలె వచ్చు శత్రువుపట్ల జాగరూకుడవై యుండుము.

883. రహస్యశత్రువు నుండి నిన్ను నీవు రక్షించుకొనుము. ఏలనన విషమఘట్టములో నతడు నిన్ను కుమ్మరి కత్తివలె ముక్కలుముక్కలుగ కోసివేయును.

884. నీమిత్రునివలె వేషమువేసికొను శత్రువున్నచో నతని తంత్రములు బహువిధములుగ నుండును. అతడు చివరకు నీ బంధుగులను కూడ నీపై తిరుగతీయును.

885. నీబంధువే నీపై ద్రోహిగ తిరుగబడిన యెడల నతడు నీ కనేకారిష్టములను చేకూర్చి నీ ప్రాణమునకే ముప్పు తెచ్చి పెట్టును.

886. రాజు ప్రస్థానములో ద్రోహము వర్ధిల్లునేని యతడెదో యొకనాడు దానికి గురికాకతప్పదు.

887. తన గృహాంగణములోనే ద్రోహికి శరణ్యమిచ్చు గృహము మూతతో నమర్చబడిన పాత్రవంటిది. ఆపాత్ర రెండుగ భిన్నమైనట్లు కాన్పించదు కాని యది యెన్నటికి నొక్కటి కాజాలదు.

888. తన యావరణలోనే ద్రోహికి స్థానమిచ్చు గృహము భస్మము కాక తప్పదు. అది యాకురాతితో రాచినపుడు పొడుమైపోవు యినుపముక్కవలె పొడుము పొడుమగును.

889. నువ్వుగింజలో నుండు చిల్లువలె స్వల్పముగ కాన్పించినను గృహములో నున్న ద్రోహము గృహనాశనమును తెచ్చి పెట్టును.

890. హృదయములో ద్వేషించు వానితో నతిసన్నిహితముగ మెలగువాడు త్రాచుతో నొకేకుటీరములో కాపురము చేయువానివంటివాడు.

## తొంబదియవ యధ్యాయము

# మహాత్ముల నవమానింపకుండుట

891. తన యోగక్షేమములను రక్షించుకొన గోరువాడు దేనినైనను సాధింపగల సర్వసమర్థుల నవమానింపకుండ తమ్ముతాము కాపాడుకొనవలెను.

892. మహాత్ముల నవమానించినచో వారి శక్తులవలన నట్టి యపరాధకుల కనివార్యములగు దుఃఖములు చేకూరును.

893. నీవు నీ నాశమునే వరింతువా ? అట్లయినచో నీవు సజ్జన వాక్యములను నీ చెవులకు సోకనీయకుము. తలచినంత మాత్రముచేత నిన్ను నాశము చేయగల మహాపురుషుల కుద్రేకము కలిగింపుము.

894. దుర్బలుడు శక్తిసామర్థ్యములు కలవారి కపచారము చేసినచో మృత్యుదేవత నతడు తనంతతాను ఆహ్వానించినట్లే యగును.

895. దుర్ఘటమైన శక్తిసంపదలుగల రాజుల కోపోద్రేకమును రెచ్చగొట్టిన యల్పమానవు లెచ్చటకు పోయినను వృద్ధి చెందజాలరు.

896. దవానలములో చిక్కుకొనినవా రైనను బ్రతుకవచ్చును. కాని మహాత్ముల నవహేళన చేసినవారికి క్షేమము లేదు.

897. ఆత్మసామ్రాజ్య ధురీణులై శక్తిసంపన్నులైన ఋషీశ్వరులు నీపై నలిగిరేని యనేక వెలుగులతో వెలిగిన నీ జీవిత మెచ్చటనుండును ? తళతళలతో తులికిన నీ ధన మెచ్చట నుండును ?

898. శాశ్వతపునాదులమీాద స్థాపితమయినట్లు కనిపించిన రాజులైనను పర్వతములవలె మహాశక్తి వంతులైన ఋషిసత్త

ములు సంకల్పింతురేని వారి సంకల్ప మాత్రముచేతనే బంధు పుత్ర కళత్ర సహితముగ నాశము చెందుదురు.

899. పవిత్ర దీక్షాదక్షులైనవా రుగ్రులైనచో దేవేంద్రు డైనను పదచ్యుతుడై తన సామ్రాజ్యమును కోల్పోవును.

900. గొప్ప యాధ్యాత్మిక శక్తిగలవారు కోపముతో మండిపడుదురేని యెంతటి బలవత్తర యాధారములుకల రాజు లైనను రక్షింపబడజాలరు.

తొంబదియొకటవ యధ్యాయము

## భార్యాలోలురు

901. తమ భార్యలకు దాసులైనవారు గొప్పతనమును సాధింపజాలరు. ఘనకార్యములను సాధింపగోరువా రట్టి తప్పు మార్గమునుండి విముఖు లగుదురు.

902. తన భార్యయెడల నత్యంత మోహాంధు డైన వాని యైశ్వర్యమే మానవదూషణకు గురియగును. అట్టివాడు సిగ్గుచే తన ముఖమును మానవులకు చూపకుండ దాచుకొనవలసి వచ్చును.

903. తనభార్యకటాక్ష వీక్షణములకు దాసిలొగ్గు దుర్బలు డెప్పుడును ప్రజ్ఞగలవారియెదుట తన ముఖమును చూపుటకు వెరచును.

904. తన భార్యముందు వణకునట్టి మోక్షహీనుడైన దౌర్భాగ్యునిశక్తి యెన్నడు గణనకు రాజాలదు.

905. తన భార్యకు భయపడువానికి పూజ్యులైన వారిని సేవించుటకైనను ధైర్యమెన్నడు నుండజాలదు.

906. తమభార్యల సుకుమారకరపల్లవ బద్ధులై వణకు చుండువారు దేవతలవలె జీవించునప్పటికి వారినే మానవుడు గౌరవింపడు.

907. అంతఃపురాంగనల పాలనకు దాసిలొగ్గిన వానికంటె వినయ సౌశీల్యవతియగు కన్య యతనితో పోల్చినచో చాల గౌరవవంతురాలు.

908. తమభార్యలచే పరిపాలింపబడుట కంగీకరించినవారు తమ మిత్రుల కోరికలనా తీర్చజాలరు; అంతేకాక మంచిని దేనిని చేయజాలరు.

909. భార్యాపాలనకు లోబడిపోయిన మానవులలో ధర్మముకాని, యైశ్వర్యముకాని చివరకు ప్రేమవలన కలుగు ఆనందముకాని కాన్పించదు.

910. మహత్తరకార్యదీక్షకలవారు, అదృష్టదేవతచే వరింపబడినవారు తమభార్యల కౌగిళ్ళకు దాసులగుట కంగీకరింపరు.

తొంబదిరెండవ యధ్యాయము

# పడుపుకత్తెలు

911. పురుషుని ప్రేమకొరకు గాక నతని ధనము కొరకే కామించు స్త్రీల జాణతనమంతయు దుఃఖమునకే దారితీయును.

912. ప్రేమ నభినయించుచు సర్వదా తమ స్వలాభమునే చూచుకొను జవరాండ్ర రీతులను కనిపెట్టి వారిని దూరములో నుంచుము.

913. స్వైరిణి తన కాముకుని ఆలింగనము చేయునపుడు ప్రేమ నభినయించును. కాని తన హృదయములో చీకటిగదిలో వింతశవమును స్పృశించుచున్నట్లామె భావించుచుండును.

914. పవిత్రకర్మముల నారాధించువారు పడుపుకత్తెల స్పర్శచే తమ శరీరములను మలినము గావింప నొల్లరు.

915. నిర్దుష్టమైనబుద్ధి, గంభీరమైన యధ్యయనసంపద కల వారు తమ జాణతనము నందరకు స్వచ్ఛందముగ విక్రయించు స్త్రీలను స్పృశింపనొల్లరు.

916. తమ నిక్షేమము పట్ల గౌరవము కలవారు శృంగార చేష్టలను విక్రయించు పణ్యాంగనాహస్తము స్పృశింపరు.

917. హృదయము నింకొక చోట సమర్పించి శరీరముతో నాలింగనము చేయు కాంతలపొందు అల్పచేతస్కులైన వారే వరింతురు.

918. వివేక శూన్యులైన వారికి పణ్యాంగనల కౌగిళ్లు దరీ కందర సీమలందు విహరించు మోహిని యాకర్షణ వంటిది.

919. జిలిబిలి వేషములు ధరించు విటకత్తెల కౌగిళ్లు నీచులైన యవివేకులు మునుగు యమకూపములు.

920. రెండు హృదయములు కలస్త్రీలు, మద్యము, జూదపు బల్ల, ఈమూడు భాగ్యోపహత చేతస్కుల వినోదములు.

తొంబదిమూడవ యధ్యాయము

# మ ద్య ని షే ధ ము

921. మద్యవ్యసనముకలవారికి శత్రువులెన్నడు భయపడరు; ఇంతేకాక వారు సంపాదించిన కీర్తికూడ తోడనే నశించును.

922. ఎవరును త్రాగకుందురుగాక! సజ్జనుల యాదరాభిమానములను నిర్లక్ష్యము సేయువారు త్రాగిన త్రాగుదురుగాక.

923. త్రాగి మత్తెక్కినవాని దృశ్య మతని కన్న తల్లికే యసహ్యముగ నుండును. ఇక పూజ్యులైన వారల కది యెట్లుండును ?

924. త్రాగుబోతుతన మను నీచ వ్యసనమున కలవడిన వాని ముఖమును సిగ్గు అను సుందరి చూడనొల్లదు.

925. నీ నిజ వీర్యమును పోగొట్టుకొని దాని బదులు జడతను తెచ్చిపెట్టుకొనుట కేవలము పిచ్చితనము.

926. దినదినము మద్య మను విషమును సేవించువారు నిద్రించినవారే యగుదురు. అంతేకాక చనిపోయినవారికిని వీరికిని భేదములేదు.

927. రహస్యముగ త్రాగుచు పగళ్ళు నిద్రామైకములో గడపువారి నిరుగువా రచిరకాలములోనే పట్టివేసి యతి నీచముగ చూతురు.

928. 'త్రాగియుండుట యన నేమియోకూడ నే నెరుగను' అని త్రాగుబోతు నటింపకుండునుగాక. అందువలన నతడు తన మొకటివ్యసనమున కసత్య సంభాషణముకూడ జోడించినవా డగుచున్నాడు.

929. త్రాగి మత్తెక్కినవానికి మద్యపానమువలన కలుగు ననర్థములను బోధించి ఒప్పింప జూచుట నీటిలోమునిగియున్న వానిని దీపముతో వెతుకబూనుట వంటిది.

930. త్రాగి పడిపోయినవానిని చూచియైనను వ్యక్తతలో నుండి చూచువాడు త్రాగినచో తనగతియు నట్టిదే యగునని తనకు తాను చిత్రించుకొన జాలడా?

## తొంబదినాల్గవ యధ్యాయము

# జూ ద ము

931. గెలుపు నీదే యైనను జూద మను వ్యసనము వంకకు పోకుము. నీగెలుపులన్నియు చేపమ్రింగునట్టి ధీవరుని గేలము వంటివి.

932. నూరు పోగొట్టుకొని యొక్కటి సంపాదించుకొను జూదరులీ ప్రపంచములో భాగుపడుటకు మార్గమేమైనకలదా?

933. తరుచు పాచికలతో జూదమాడుటకు దిగువాని ధన మంతయు పరులపాలగుట తథ్యము.

934. జూదమువలె నిస్సందేహముగ దారిద్ర్యము తెచ్చి పెట్టున దింకొకటిలేదు. అది మానవుని కీర్తిని నాశనముచేయును; అతని హృదయమును ప్రతికూలాభాగ్యపు పనికి నొడంబడునట్లు చేయును.

935. పాచికలను విసరుటలో చతురులమనుచు నిక్కి జూదపు గృహముల వెంటబడిన రసికు లనేక మంది లేకపోలేదు. కాని చివరకు దుఃఖింపనివాడందులో నొక్కడును లేడు.

936. ద్యూతమను వ్యసనరూపమును ధరించివచ్చిన జ్యేష్ఠా దేవతచే మోహితులైనవారు తిండికి వాచి మాడుటయే కాక సమస్త దుఃఖములకు పాల్పడుదురు.

937. నీవు నీకాలము నంతను జూదపు గృహములో గడుపుదువేని నీపిత్రార్జితమూ సెలవుపుచ్చుకొనును. నీకున్న మంచి పేరూ నశించిపోవును !

938. జూదము నీధనమును నీమర్యాదను నాశము చేయును. అది నీ హృదయమును పాషాణ మొనర్చి నీకు దుఃఖము తెచ్చిపెట్టును.

939. జూదమాడువాని కీర్తి, విద్య, ధనము నశించును. అంతేకాదు. అతడు తిండికి గుడ్డకు ముప్పెత్తవలసివచ్చును.

940. పందెములలో నోటమి కలిగినకొలది ద్యూతపు వ్యసనము హెచ్చుచుండును. అట్లే జీవితములో దుఃఖములు హెచ్చిన కొలది ఆత్మజీవితము కొరకు మరింత పరితపించుచుండును.

## తొంబదియైదవ యధ్యాయము

# ఔ ష ధ ము

941. ఋషులచే నిర్వచింపబడిన వాత, పిత్త, కఫము లను త్రిదోషములు సామ్యావస్థ నతిక్రమించినపుడు వ్యాధులను తెచ్చిపెట్టును.

942. పూర్వము తినిన తిండి సంపూర్ణముగ జీర్ణించిన తరువాతనే క్రొత్తతిండి తినుచో శరీరమున కెట్టి మందు అవసరము లేదు.

943. నీవు తినినతిండి జీర్ణమైన తరువాతనే మితముగ తినుము. నీ జీవితమును పొడిగించుకొనుట కదియే మార్గము.

944. నీవు తినినతిండి జీర్ణమగువరకు, కరకర ఆకలి యగు వరకు వేచియుండి తరువాతనే నీ శరీరతత్వమునకు పడు పదార్థములనే మితముగ తినుము.

945. నీశరీరతత్వముతో భేదింపని యాహారము నతిమితముగ తిందువేని నీ శరీరమునకెట్టి వ్యాధులు తటస్థింపజాలవు.

946. కడుపు కాళీయైనపుడు మాత్రమే తినువాని నారోగ్యము వరించునట్లు మితిమీరి తినువానినే రోగము వెంటాడును.

947. తన జఠరాగ్నియొక్క ప్రమాణమునుదాటి యవివేకముగ భుజించువారి వ్యాధులకుగూడ మితియుండజాలదు.

948. వ్యాధి, దానిమూలము, దాని చికిత్సా విధానము తెలిసికొనుము. తరువాత దాని నివారణకు కావలసిన ప్రతి జాగ్రత వహింపుము.

949. వైద్యుడు రోగియొక్కయు రోగముయొక్కయు ప్రమాణములను గుర్తించునుగాక. ఋతువునుకూడ పురస్కరించుకొని యతడు తగిన జాగ్రతలతో చికిత్స కుపక్రమించునుగాక.

950. రోగి, వైద్యుడు, మందులు, మందులుచేయువాడు ఈ నాలుగింటిమీద చికిత్స యంతయు నాధారపడియుండును. ఈ నాలుగింటిలో ప్రతిదానికి నాలుగేసి గుణములు కలవు.

రాజ్యాంగ శరీరముయొక్క అవయవములు
అను శీర్షిక గల రెండవ భాగములోని
రెండవ ప్రకరణము సమాప్తము.

---

# మూడవ ప్రకరణము



కలగూరగంప

తొంబదియారవ యధ్యాయము

## గౌరవమైన పుట్టుక

951. మంచి కుటుంబములో పుట్టినవారికి మాత్రమే ధర్మ గుణము, సిగ్గుపడు స్వభావము ప్రకృతి సిద్ధముగ కలుగును.

952. సాధుజన్మకలవారు ఋజువర్తనము, సత్యము, వినయము అను మూడు విషయములనుండి పతితులు కాజాలరు.

953. హసించుచుండు ముఖము, వితరణగల హస్తము, మధుర భాషణము, అణకువ — ఈనాలుగు సజ్జనాళికి ప్రకృతి జన్యగుణంబులు.

954. కులీనులు కోట్లకొలది ధనముకైనను తమపేరు మలిన మొనర్పనిచ్ఛగింపరు.

955. ప్రాచీన కుటుంబములలోను, గొప్ప కుటుంబములోను పుట్టినవారి వదాన్యతనుప్రకటించు వస్తుసంపద తగ్గిపోయిననూ తమ దాతృత్వమును మాత్రము వారు విడువజాలరు.

956. తమ కుటుంబ గౌరవసాంప్రదాయముల నకలంకముగ నిలుపగోరువా రెన్నడు వంచనకు నీచకార్యములకు పాల్పడరు.

957. చంద్రమండలములోని మచ్చ స్ఫుటముగ కన్పించున ట్లుదారవంశజాతుని దోషము బహిరంగముగ కన్పించుచునే యుండును.

958. మంచికుటుంబములో పుట్టినవాని నోటినుండి దూర్భాషలు పుట్టునేని ప్రజ లతని పుట్టుకను గురించియే శంకింతురు.

959. క్షేత్రముయొక్క సత్తువ అచ్చట బయలుదేరు మొలకనుబట్టియే తెలిసిపోవును. ఇట్లే మానవుని కుటుంబ మతని నోటినుండి వెడలు మాటలనుబట్టి తెలిసిపోవును.

960. నీవు గుణమును వాంఛింతువేని సిగ్గుపడు స్వభావము నలవర్చు కొనవలెను. నీవు నీ కుటుంబమును గౌరవింపగోరుదు వేని నీ వందరియెడల మర్యాదగ ప్రవర్తింపవలయును.

తొంబదియేడవ యధ్యాయము

# గౌ ర వ ము

961. నీ జీవితావసర విషయములైనను నిన్ను అధోగతికి గొంపోవు విషయముల వంకకు పోకుము.

962. తమవెనుక గౌరవమైన పేరు విడిచిపెట్టి వెళ్ళగోరు వారు ఖ్యాతికొరకైనను అధర్మకార్యములను చేయరు.

963. ఐశ్వర్య దినములలో వినయమును సాధింపుము. కాని దారిద్ర్యములో నీగౌరవమును మాత్రము విడిచిపెట్టకుము.

964. గౌరవప్రతిష్ఠలుగల పేరును మలినభూయిష్ఠ మొనర్చు కొనినవారు ముండనము చేయబడి పారవేయబడిన వెంట్రుకల వంటివారు.

965. పర్వతమంతటి మహనీయత కలవారైనను గురివింద గింజంత యమానుషకృత్య మాచరించినచో అల్పులై పోవుదురు.

966. తనకు కీర్తినా ప్రసాదింపదు! స్వర్గమార్గమునకా దారి చూపదు! అయినను మానవుడు తనను ద్వేషించువారి నాశ్ర యించుకొని బ్రతుకుట కేలప్రయత్నించునో తెలియకున్నది.

967. తనను నిందించువారిని పట్టుకొని ప్రాకులాడి యుదర పోషణచేసికొనుటకంటె వెంటనే చనిపోవుట మేలు.

968. మానవులు గౌరవము పోగొట్టుకొనియైనను శరీర మును కాపాడుకొనజూతురే! శరీరము చావులేనిదనియా?

969. చమరీమృగము పింఛముపోవునేని తన ప్రాణమునే విడిచిపెట్టుచున్నది. అట్లే తమ గౌరవమును కాపాడుకొన లేనపుడు తమప్రాణములను త్యజించు మానవులును కలరు.

970. తమ మంచిపేరు పోయినతరువాత జీవింప నిరాకరించు మహనీయులకు ప్రపంచము చేయెత్తి నమస్కరించి వారి కీర్తి వేదికమీద సేవాంజలులు సమర్పించును.

తొంబదియెనిమిదవ యధ్యాయము

# మ హ నీ య త

971. మహనీయత యన నేమి? ఘనకార్యములను సాధింప వలె నను కోరికయే. 'నే నదేమియు నక్కఱలేకుండగనే జీవింతును?' అను చింతయే అల్పత్వము.

972. పుట్టుకలో మానవులందరు నొకేవిధముగ పుట్టుదురు. కాని వారు జీవించు జీవితములనుబట్టి వారి కీర్తి ప్రతిష్ఠలు భేదించుచుండును.

973. గొప్పతనము లేనివారు గొప్పవా రనిపించుకొనినను గొప్పవారు కానేరరు. తక్కువ కులములో పుట్టినవా రైనను నీచత్వము లేనివారు నీచులు కాజాలరు.

974. స్త్రీ తనమానమును తానే రక్షించుకొనునట్లు తనకు తాను సత్యవంతుడై నపుడే మహనీయత రక్షింపబడగలదు.

975. మహనీయులు తగిన సాధనసంపత్తిని ప్రయోగింపగల వీర్యవంతులై యితరులు సాధింపలేని కార్యములను సాధింతురు.

976. గొప్పవారిని పూజించి వారి యాదరాభిమానములను దయను సంపాదింపగల యిఙ్గిత జ్ఞాన మల్పచేతస్కులకుండజాలదు.

977. అల్పబుద్ధుల కదృష్టమే పట్టుట తటస్థించునేని వారి గర్వమునకు హద్దులే యుండవు.

978. మహనీయత సదా వినయవిభూషితమై మోనదూరమై యుండును. కాని యల్పత్వము తన గుణములను ప్రపంచము నకు మద్దెలలతో చాటుచుండును.

979. మహనీయత అందరియెడలను వినయమునే కన బరచును కాని యల్పత్వము గర్వాంధతయొక్క యపరావ తారమే యనవచ్చును.

980. మహనీయత పరుల దోషములను సదా దాచిపెట్టు చుండును. కాని యల్పత్వము దోషములనుగురించి తప్ప మరి దేనినిగురించియు మాట్లాడనే మాట్లాడదు.

## తొంబదితొమ్మిదవ యధ్యాయము

## ప్రజ్ఞ

981. తమ విధులను గుర్తించుచు స్వయంప్రజ్ఞను సముపా ర్జింప గోరువారి దృష్టిలో మంచిదంతయు తమధర్మమే యగును.

982. ప్రజ్ఞగలవారి శీలధనమే వారిలోనున్న ప్రజ్ఞాధనము. తక్కిన విశేషము లేవియు వారి ప్రజ్ఞకు మెరుగు పెట్టజాలవు.

983. సర్వభూతదయ, సిగ్గుపడు స్వభావము, ప్రసాద గుణము. పరులదోషములందు సహనబుద్ధి, సత్యము — ఈ యైదు ఉదారశీలమును దివ్యభవనమున కాధారస్తంభములు.

984. చంపకుండుట ఋషిలక్షణము. అసహ్యాసంభాషణము చేయకుండుట బుద్ధివంతుల లక్షణము.

985. వినయమే బలవంతుల బలము. అదియే ప్రజ్ఞావంతులను వారి శత్రువులనుండి కాపాడు కవచము.

986. ప్రజ్ఞను పరిశీలించు ఒరిపిడిరాయి యేది? గొప్పతనమొనరిలో నున్నను, వారితరత్ర మనకంటె తక్కువవారే యైనను, దానిని గుర్తించుటయే ప్రజ్ఞావంతుని లక్షణము.

987. తన కపకారము చేసినవారికైనను మంచిచేయనినాడు ప్రజ్ఞావంతునిలోనున్న ఘనత కర్థమేమి?

988. శీలధనము కలవారికి దారిద్ర్య మొక యమర్యాద కాజాలదు.

989. ఇతరలోకమంతయు నొక్కుమ్మడిగ తిరుగబడినను ధర్మమార్గమునుండి పీసమంతయు తొలగనివారే ప్రజ్ఞాపరావతార మనదగును.

990. పుణ్యాత్ములే తమ పవిత్రతను కోల్పోయి పతితులగుదురేని నిశ్చయముగ భూదేవికూడ యీ మానవభారము భరింపజాలదు.

నూరవ యధ్యాయము

# మర్యాద

991. చేతులుచాచి సర్వజనుల నాహ్వానించి సహాయము చేయువారికి మర్యాద దానంతటదియే సులభముగ చేకూరును.

992. మానవత్వము, సుశిక్షణము, మర్యాద యనునవి ఉదారగుణములుగ పరిణమించును.

993. బాహ్యచిహ్నములలో సామ్యత యున్నంతమాత్రము చేత మానవులు బంధింపబడుటలేదు. ఆదరాభిమానములుగల ప్రవర్తనా సామ్యమే వారినొక సంఘముగ హత్తుకొనిపోవునట్లు చేయగలదు.

994. న్యాయధర్మములను ప్రేమించుచు నుపకారగుణము ప్రదర్శించువారి నైతిక ప్రవర్తనకు ప్రపంచము గొప్ప విలువ యిచ్చును.

995. కేవలము వేళాకోళమున కాడినమాటలైన గౌరవ వాక్యములు మానవునకు బాధకలిగించును. కనుక సజ్జనులు తమ శత్రువులయెడలకూడ నమర్యాదగ ప్రవర్తింపరు.

996. సాధువు పురుషుల యునికి మూలముననే ప్రపంచము సామరస్యముగ మనగలుగుచున్నది. నిశ్చయముగ వారే లేని యెడల ఈసామరస్యమంతయు నశించి ధూళిలో కలిసిపోవును.

997. సాధువర్తనము లేనివారు ఆకురాళ్ళవలె వాడికల వారేయైనను కఱ్ఱదుంగలకంటె మనులు కాజాలరు.

998. అధర్మపరులైనను శత్రువైనను నురెవ్వరైనను మానవునకు మానవులయెడ నమర్యాద యర్హము కాదు.

999. హాసన్మ్ముఖులు కాజాలనివా రియతివిశాల ప్రపంచ ము లో పట్టపగలుకూడ చీకటినితప్ప మరిదేనిని చూడజాలరు.

1000. మూర్ఖుని చేతిలోని ధనము మలినపాత్రలో పోసిన పాలువలె దుష్టమైపోవును.

101 వ యధ్యాయము

# సద్వినియోగము కాని ధనము

1001. ఇనుపపెట్టెలనిండ ధనము ప్రోగుచేసి దాచిపెట్టి యనుభవింపని దౌర్భాగ్యుడు మృతిచెందినవాడే యగును. ఏలనన అతడు దానను భవింపడు; ఉపయోగింపడు.

1002. ధనమే సర్వస్వమునని దాని నెవరికి నీయక కుప్పలు పెట్టు లోభి ముందుజన్మలో రాక్షసుడగును.

1003. సర్వకాలసర్వావస్థలయందు ధనము ప్రోగుచేయుచు కీర్తికొరకు ప్రయత్నింపనివారి జీవితములు భూమికి బరువుచేటు.

1004. తన యిరుగువారి ప్రేమను సంపాదించుటకు ప్రయత్నింపని మానవుడు చనిపోయినతర్వాత తన వెనుక దేనిని దిగపెట్టవలెనని తలంచునో కదా?

1005. ఇతరులకీయక తాము అనుభవింపక జీవించు కొక్కిరాయులకు కోట్లున్నను యథార్థమునకు వారు దేనిని కలిగియుండుట లేదు.

1006. ఒకడు తన విత్తమును తా ననుభవింపడు. యోగ్యులైనవారి కుచితముగ నీయడు. అట్టివాడు భాగ్యదేవతకే చేటు; అనర్థకారి.

1007. ఆపన్నులకీయని వాని చేతి ధనము ఏకాంత జీవితముతో యౌవనమును వ్యర్థముచేయు సుందరాంగి మేను వంటిది.

1008. మానవులచే ప్రేమింపబడని వాని వైభవము గ్రామమధ్యమున ఫలించు విషవృక్షమువంటిది.

1009. ధర్మచింతలేక తనను తన హృదయమును మాడ్చి ధనసంచయముచేసిన మానవుని ధనము దొంగలకొరకే యగును.

1010. దాన ధర్మములచేత తన ధనమును నిశ్శేషముగ వెచ్చించిన వదాన్యుని కొరత జలదముల లేమివంటిది. అది చిరకాలముండజాలదు.

102 వ యధ్యాయము

## సిగ్గుపడు స్వభావము

1011. సత్పురుషు లసభ్యకార్యములు చేయుటకు సిగ్గుపడుదురు. దానికిని స్త్రీలు అభినయించు సిగ్గుకును చాల భేదము కలదు.

1012. అన్నము, వస్త్రము, సంతానము మానవులందరకు సమానములే. కాని సిగ్గుపడు స్వభావముచేత మానవులలో నెంతేని భేద మేర్పడుచున్నది.

1013. అన్ని జీవులకు శరీరమే ప్రాణనిలయము. కాని పవిత్ర మొనరించు వ్రీడయే గుణమునకు నిలయము.

1014. వ్రీడాస్వభావమే యోగ్యుల కలంకారము కాదా? అది లేనిచో మానవులకు సంభవించు విభ్రమగుడు చూపరుల కంటికి భారముగ నుండదా?

1015. ఇతరుల యపఖ్యాతి తమదిగా భావించి సిగ్గుపడు వారు సౌకుమార్యమునకే మూలకందములు సుమా!

1016. పుణ్యాత్ములు లజ్జింపతగని మార్గములద్వారా తప్ప తదితర మార్గములద్వారా రాజ్యమునైనను ఆర్జింప నొల్లరు.

1017. గౌరవమును ప్రాణప్రదముగ చూచుకొను వారవ మానము భరించుటకు బదులు ప్రాణములనే విసర్జింతురు. కాని వారు తమ ప్రాణములను రక్షించుకొనుటకైన నవమానమును మ్రింగివేయ జాలరు.

1018. ఇతరులు చేసిన లగ్గు. తానుచేసిన యొగ్గు. అను తత్త్వము గలవానిని చూచి ధర్మదేవతయే సిగ్గుపడును.

1019. శాస్త్రము శాసించు విధులను చేయనిచో మానవుని కుటుంబమునకు మాత్రమే నష్టము. కాని సిగ్గువిడిచిన మానవుడు మంచినంతను పోగొట్టుకొనును.

1020. సిగ్గుపట్లు మృతప్రాయులైన వారు జీవింపనివారే యగుదురు. తోలుబొమ్మలవలె వీరు అసత్య జీవితమును గడుపుదురు.

103 వ యధ్యాయము

## కుటుంబాభివృద్ధి

1021. తనచేతులతో పనిచేయుట కెన్నడు విసుగుచెందని మానవుని నిశ్చయముతో తుల్యముగ కుటుంబము నభివృద్ధి చేయగల దింకొకటి లేదు.

1022. గాఢమైనజ్ఞానము, పౌరుషము — ఈరెండు సమృద్ధముగ నున్న కుటుంబ మున్నతి చెందును.

1023. 'నేను నాగృహము నుచ్ఛస్థితికి తెచ్చెదను' అని చెప్పుచు మానవు డుద్యమించునేని దేవతలు కూడ నడుములు బిగించి వానిముందు బయలుదేరుదురు.

1024. తమ కుటుంబము నభివృద్ధికి తెచ్చు యత్నములో నిసుమంతయు విరామము చెందని వారి పనులు, ప్రణాళికలు లేకున్నను, వాటంతటవియే యభివృద్ధి చెందును.

1025. పాపమాచరింపకుండ తనకుటుంబమున కౌన్నత్యము ప్రసాదించినవాని కఖిలజగము బంధువేయగును.

1026 తను జన్మించిన వంశమున కుచ్ఛస్థితి ప్రాప్తింపజేయుటయే యుత్తమోత్తమ పౌరుషము.

1027. యుద్ధరంగములో సమరభారమంతయు ధైర్యవంతుల మీదనే పడునట్లు కుటుంబ నిర్వాహణ భారమంతయు దానిని వహింపగలవారి భుజములమీదనే పడును.

1028. తమ కుటుంబాభివృద్ధి కోరు వారికి కాలముతో నిమిత్తములేదు. వారు సోమరితనముచేత గొప్పచేత బాధింపబడుదురేని వారి గృహము నీచస్థితికి రాకతప్పదు.

1029. తనకుటుంబమును సర్వానర్థముల నుండియు రక్షింపం గోరువాని శరీరము కష్టములకు, దుఃఖములకు మాత్రమే భాజనమగుటలేదా ?

1030. కుటుంబమును నుద్ధరించు యజమానియే లేని కుటుంబమూలములను దుఃఖములు విచ్ఛేదము చేయును; ఆకుటుంబమధఃపతితమగును.

## 104 వ యధ్యాయము

# వ్యవసాయము

1031. భూమండల మంతయు తిరిగిన తిరుగుదురు గాక. మానవులు చిట్టచివరకు తమ యాహారమునకు నాగలిమీద

నాధారపడక తప్పదు. కనుక నెంతటి కష్టపరంపరలున్నను వ్యవసాయమే ప్రధాన పరిశ్రమ యగుచున్నది.

1032. సంఘమునకు వ్యవసాయకులే కీలక స్థానము. ఏలనన నాగలి పట్టి దున్నలేక నితరపనులనుచేయు వారి నందరను వారే పోషించుచున్నారు.

1033. భూమిదున్ని జీవించువారొక్కరే జీవించువారు. తక్కిన వారందరు వారితరువాతవారు; పరాన్నమును తిను పరభృత జీవులు.

1034. ఏ ప్రజల క్షేత్రములు శాల్యాది సస్యభారముచే భూమికంట వంగియుండునో యట్టిప్రజల రాజుయొక్క ఛత్రము ముందర యితర రాజుల ఛత్రములు వంగియుండును.

1035. వ్యవసాయఫలము ననుభవించు ప్రజ లితరులనుండి ముష్టెత్తరు సరికదా యడిగినవారికి లేదనకుండ వారే యన్న సంతర్పణచేతురు.

1036. వ్యవసాయదారే చేతులు ముడుచుకొని కూర్చున్న యెడల సర్వకోరికలను విసర్జించిన వారుకూడ బాధపడక తప్పదు.

1037. సీపాలములోని యొకఔన్సు మట్టిముద్ద పాతికఔన్సు పొడుమగునట్లు యెండకట్టుదు వేసి యిక నేయెరువు వేయనక్కర లేకనే యది సమృద్ధిగ పండును.

1038. దుక్కికంటె పెంటవేయుటయే యెక్కువ లాభ దాయకము. కలుపుతీసిన తరువాత నీటిసరఫరా కంటె చేనును సంరక్షించుటయే యెక్కువ లాభదాయకము కాగలదు.

1039. యజమాని తనపొలమును చూచుకొనకుండ యింటి యొద్దనే కూర్చున్నచో స్త్రీవలెనే పొలముకూడ నతనినిచూచి పరిహాసించును.

1040. 'అయ్యో! నాకు తినుట కేమియు లేదు' అని యేడ్చు సోమరినిచూచి భూదేవి తనలో తాను నవ్వుకొనును.

## 105 వ యధ్యాయము

# దారిద్ర్యము

1041. దారిద్ర్యముకంటె మిక్కిలి బాధాకరమైన దేది కలదో యెరుంగగోరెదవా? దారిద్ర్య మొక్కటే దారిద్ర్యముకంటె నెక్కువ కఠోరమైనదని గ్రహింపుము.

1042. దారిద్ర్యమను పెనుభూత మిహాపరలోక సౌఖ్యములు రెంటికినికూడ శత్రువే యగుచున్నది.

1043. దారిద్ర్య మనబడు దురద మన రక్తములో ప్రవహించుచున్న శీలగౌరవాదులను, భాషాసంస్కారమును నశింపు చేయును.

1044. దారిద్ర్యము గొప్పకులములో పుట్టినవారినికూడ తమకుగల గౌరవము మరచిపోవునట్లు చేసి నీచబానిసభాషలో మాట్లాడునట్లు చేయును.

1045. దారిద్రమను ఈ యొక్కదోషము క్రింద వేలకొలది దుఃఖములు లడగియున్నవి.

1046. దరిద్రులు పరమసత్యములనే యద్భుతజ్ఞానముతోను, అపూర్వ చతురతతోను చాటినను వారి మాటలకు విలువ యుండదు.

1047. గుణరహితమైన దారిద్ర్య మాదుర్భగుని కన్నతల్లికి కూడ నితనితో వైరము తెచ్చుచున్నది.

1048. నేడుకూడ దారిద్ర్యముతో నా కీసహవాసము తప్పదా? అది నిన్ననే నన్ను చచ్చిపోవునట్లు నులిమి వేసినదే? *.

1049. అగ్నిజ్వాలల మధ్యనైనను నిద్రింపవచ్చును గాని దారిద్ర్యాంబుధి మధ్య నిమిషమైనను నిద్రించుట దుర్లభము.

1050. దరిద్రులకు తమ జీవితములను పూర్తిగా విసర్జించుటొక్కటియే శరణ్యము. అట్లు చేయకుండుట యితరుల గంజి, యుప్పులకే మరణము.

## 106 వ యధ్యాయము

# ముష్టి

1051. దానధర్మములు చేయగలవారిని నీకు సాయము చేయుమని నీవు ముష్టెత్తవచ్చును. వారు చేయజాలమని నటించుతురేని యాదోషము వారిది కాని నీది కాదు.

---

* ఓః దరిద్రుని తలవ్రాత.

1052. ఎట్టియవమానములకు పాల్పడకుండ నీవు భిక్షించు నది నీకు సమకూరునేని ముష్టెత్తుట కూడ సుఖదాయకము గనే యుండును.

1053. తమవిధిని గుర్తించి సహాయము చేయజాలనని నటింపని సధర్ములను యాచించుటలో కూడ నొక యందముగలదు.

1054. ప్రార్థించినవానికి కలలోకూడ తిరస్కరింపనివానిని యాచించుటకూడ యిచ్చుటంత గౌరవప్రదమైనదే.

1055. ఈప్రపంచములో ముష్టి పెట్టుటకు నిరాకరింపని వారుండుట చేతనే మానవులు స్వేచ్ఛగా భైక్షుక వృత్తినొక జీవితసాధనముగ నవలంబించుచున్నారు.

1056. దానధర్మములను చేయనిరాకరించు దుస్స్వభావము లేనివారిని చూచినంత మాత్రముచేతనే దరిద్రబాధ యుపశమించును.

1057. ముష్టివానిని వెటకారము చేయకుండ, తిట్టకుండ పెట్టువారిని కలుసుకొనినపుడు ముష్టివాని హృదయముసంతోషముతో నుప్పొంగును.

1058. ముష్టెత్తువారే లేనిచో నీప్రపంచముకంతకు తోలుబొమ్మల నాట్యముకంటె గొప్పయర్థమేమియు నుండజాలదు.

1059. ఈ ప్రపంచములో ముష్టియెత్తువారే లేనిచో వదాన్యతలో నున్న గొప్పతన మెచ్చట నుండును ?

1060. చేయలేనని యొకడు చెప్పినపుడు భిక్షుకుడు కంటగించుకొనకుండును గాక. ఏలనన తన దారిద్ర్యమే యెదరవాడు కూడ తన స్థితిలోనే యుండవచ్చునని యతనికి బోధింపవలయును.

## 107 వ యధ్యాయము

# బిచ్చము భీతావహము

1061. బిచ్చమెత్తనివాడు బిచ్చమెత్తువానికంటె కోటిరెట్లు యోగ్యుడు. ప్రేమపూర్వకముగను, సంపూర్ణ హృదయముతోను పెట్టువానివద్దనైనను బిచ్చమెత్తనివాడు బిచ్చమెత్తువానికంటె కోటిరెట్లు యోగ్యుడు.

1062. తనతిండికొరకు ముష్టియెత్తుకొని తినవలసిన స్థితికి వచ్చినతరువాత కూడ మానవుడు జీవింపవలెననియే యీ భూమిని సృష్టించిన సృష్టికర్త యుద్దేశ్యమైనయెడల నా సృష్టికర్త ప్రపంచమంతయు తిరిగి తిరిగి నశించుగాక.

1063. 'నా దారిద్ర్యమును ముష్టెత్తుకొని పోగొట్టుకొందును' అని తనకుతాను చెప్పుకొను కాఠిన్యతనుమించిన కష్టమింకొకటి యీ ప్రపంచములో లేదు.

1064. కటిక దారిద్ర్యము ననుభవింపవలసి వచ్చినను బిచ్చ మెత్తుట కంగీకరించని గొప్పతనము ముందర ఈ విశ్వమంతయు నత్యల్పమైనది సుమా !

1065. నీటివంటి పల్చని గంజియే యైనను స్వశరీర కష్టముచే సంపాదించిన తిండికంటె రుచికరమైన దింకొకటి లేదు.

1066. గోమాత కొరకు నీరములను నీవు ప్రార్థించినను బిచ్చమెత్తుటకు చేయు ప్రార్థనకంటె జిహ్వా కవమానకరమైన విషయ మింకొకటి లేదు.

1067. 'బిచ్చమెత్తుట తప్పనిసరియే యైనచో పిడికిలివిప్పని కష్టాత్ముల వద్ద బిచ్చమెత్తకుము' అనియే నేను బిచ్చమెత్తు వారందరిని బిచ్చమెత్తుదును.

1068. ముష్టియను దురదృష్టనౌక కపటమను పర్వతమును తాకిన వెంటనే విచ్ఛిన్నమైపోవును.

1069. ముష్టివాని దుఃస్థితిని తలచుకొనినపుడే హృదయము కరగిపోవును. ఇక నతడు పొందు యవమానములను తలచు. కొన్నచో హృదయము కేవలము నీరువిడిచిపోవును.

1070. 'లేదు' అని చెప్పునపు డా కపటాత్ముని జీవిత మెచ్చట డాగొనునో! అతని యవజ్ఞా శబ్దమును వినినంతనే బిచ్చగాని ప్రాణపక్షి యెగిరిపోవుచున్నది.

108 వ అధ్యాయము

# నికృష్ట జీవితము

1071. ఈ నికృష్టజీవులు మానవులతో నెట్లు మెలగుదురు! దానితో నుపమింపదగిన దింకొకటిలేదు.

1072. ఈ యధము లంతరాత్మ కలవారికంటె సుఖవంతులు కదా! ఏలనన హృదయవేదన ననుభవింపవలసిన పని వారి కెన్నడు లేదు.

1073. దేవతలవలెనే యీభూమిమీద నీచులును తమకు తామే న్యాయనిర్మాతలు.

1074. ఒకయధము డింకొక నీచుని కలసుకొనునపుడు దుర్మార్గములో నత డతని నోడించి తన విజయమునకు గర్వించును.

1075. భయమొక్కటియే యధములను ప్రేరేపించు ప్రేరణ. ఇంకొక ఓదేని యున్నచో నది దాహము. ఇది స్వల్ప ప్రయోజనకారి మాత్రమే యగుచున్నది.

1076. నీచులు టమటమా వంటివారు. ఏలనన వారికిదాచ యిచ్చిన రహస్యములను వారితరులకు వెల్లడిజేసిన కాని విశ్ర మింపరు.

1077. సాగదీసి దవడపగలగొట్టు వారికి తప్ప యధములు మరెవ్వరికిని అన్నముచే తడియైన చేతినైనను విదిల్చుటకు వణుకుచుందురు.

1078. ఒక్కమాటతో మాత్రమే యోగ్యులైన వారిని శాసింపవచ్చును. కాని యధములు చెరకుముక్కను యంత్రములో నలగగొట్టినట్లు నలిపినగాని యేమియు ప్రసాదింపరు.

1079. ప్రక్కవాడు కాస్తబట్టకట్టుకొని తిండితినినచాలును. దుర్మార్గున కతని శీలములో సదా దోషములే కన్పించు చుండును.

1080. దురదృష్టము సంభవించినపు డధమునకు దిక్కేది కలదు? అతని కొక్కటే శరణ్యము కలదు. అతడు సాధ్యమై నంతత్వరలో తన్ను తాను బానిసగ విక్రయించుకొను టొక్కటే మార్గము.

కలగూరగంప యనుశీర్షికగల రెండవభాగములోని
మూడవ ప్రకరణము అర్థము అనుశీర్షికగల
రెండవభాగము సమాప్తము.

---

# ము ం దు మా ట

ఈ మూడవభాగములో గాంధర్వ వివాహము, ప్రేమ యొక్క వివిధావస్థలు, నాయికానాయకుల హావభావ చేష్టలు, ఉత్తమ ప్రేమలక్షణములు ప్రేమయొక్క యథార్థ పరిణామము వర్ణింపబడెను. ఈ భాగములోని ప్రతివాక్యమును నాయకుడో లేక నాయికయో లేక చెలికత్తెయో పలుకుచుండును. నాయకుడు శౌర్యధైర్యపౌరుషుడు ప్రథమసందర్శనము లోనే నాయికానాయకు లొకరినొకరు ప్రేమించుకొందురు. ప్రేమ వారిని ముట్టడి వేయును. ఊరిలో గుసగుసలు బయలు దేరును. ప్రజాపవాదము తల్లికి తెలియును. నాయకుడు తన ప్రేమను బహిరంగముగ వెల్లడిచేయును—

వివాహము జరిగిన కొద్దికాలముననే నాయకుడు దూర దేశము పోవలసియుండును. నాయిక యీ యెడబాటు కెంత మాత్రము నంగీకరింపదు. వెంటనే తిరిగి వత్తునని చెప్పి చివరి కాతడామెనెట్లో యొప్పించుకొనును—

అతడు తిరిగి వచ్చుటకు కొంత కాలవిలంబనము జరుగును. ఈ కాలములో వారుభయులు ప్రేమయొక్క దశవిధావస్థల ననుభవింతురు. అతడు యుద్ధరంగములో పనిచేయుటకు వెళ్లి కొంత కాలమునకు తిరిగి వచ్చును. అతడు తిరిగి వచ్చువరకు నామె దినములను లెక్కించుకొనుచు నెట్లో యోపికపట్టును.

ఆమె ప్రాణత్యాగము చేసినతర్వాత నేను పోయిన లాభమేమి యని యతడు విచారించును.

చివర కతడు తిరిగి వచ్చును. వా రానందపరవశు లగుదురు. కాని యతడు తిరిగి యుద్ధమునకు బయలుదేరు నేమో యని యామె విచారించును. తనకంటె విజయమునె యెక్కువగ చూచుకొను చున్నాడని యామె యతనిని దూరును.

# ప్రేమ

గాంధర్వ వివాహము - ప్రేమయొక్కదాడి

109 వ యధ్యాయము

## నాయకుడు

1081. ఈయసదృశ రూపము భూతలమున విహరింపవచ్చిన దేవతయా ? మదభరిత కేళికుల విశిష్టరూపమా ? వలపుల రాణియగు మర్త్యభామినియా ? ఎట్లు నిరూపించుటకును నా కండ్లు మిరుమిట్లు గ్రమ్మినవి. నాహృదయము తత్తరపడినది. నావాక్కు బంధింపబడినది.

1082. ఈ మోహిని తనతీవ్రదృగ్బాణములను నాపై సారించి నపుడే నన్ను వివశుని గావించెను.

1083. ఓహో ! మృత్యువా ! ఇంతవరకు నిన్ను నేనెరుగను. నీ విపుడు సువిశాలములు, యుద్ధతంత్ర నిపుణములునగు నేత్రములు కల స్త్రీరూపమును ధరించి వచ్చితివా ?

1084. ఆమె యమాయిక ! భీరువు. కాని యామె నేత్రములు యుద్ధకళలో నారితేరి వీక్షించువారి ప్రాణములను జుఱ్ఱివేయునట్లున్నవి.

1085. ఎంతతియ్యని చూపులు. ఆచూపులోనున్నది మృత్యుబాణమా ? జాణతనములేని యమాయకురాలి చంచల

దృక్కులా? జింకయొక్క బిత్తరిచూపులా? కాదు కాదు. ఈయవ్యాజ చూపులం దీమూడును మిళితమైనవి.

1086. ఆమె క్రూరంపుచూపులకు నేను భీతిల్లుచున్నాను. భ్రూభంగములులేని కనురెప్ప లామె నేత్రములను కప్పివేయ రాదో!

1087. ఈమె 'రుచిర కుచోపరిచేలాంచలము' క్రుద్ధకుంభి నేత్రపట్టమువలె నున్నది. *

1088. ఆహా! నావీరత్వము, యుద్ధరంగములో నన్నింత వరకు నెదుర్కొనని వారిని కూడ కంపింపజేయు నా మగటిమి యీమె నిద్దపు ఫాలభాగము చేతనే జయింపబడెనా?

1089. జింకవలె బిత్తరి చూపులు చూచుప్రేయసీ! వినయ విభూషితాంగీ! ఈనిసర్గశోభను మలినమొనర్చు వికార భూషల వలన నీకేమి ప్రయోజనము?

1090. త్రాగినపుడే మధువు సంతోషమును గూర్చు చున్నది. అది ప్రేమవలె నేత్రగోచరమయి నంతనే యాహ్లాదము నొసగజాలదుకదా!

---

* వస్త్రమే లేనియెడల పురుషులామె సౌందర్యముచే హతులగుదురు. మా వటివాండ్రు మదగజముల నేత్రములను లోహముతో చేయబడిన రేకులతో కప్పివేయుదురు.

## 110 వ యధ్యాయము

### హావభావప్రకటన — హృదయ మవగతమగుట

## నా య కు డు

1091. ఆమె కాటుకకన్నుదోయి నుండి రెండురకముల చూపులు బయలుదేరును. ఒకటి హృత్తాపమును కలిగించు కెంపుచూపు. రెండవది యాతాపము నుపశమింపజేయు చల్లని చూపు.

1092. ప్రియునిపై దొంగతనముగా సారింపబడు విద్యుద్వీక్షణ మెంతసుఖకరమైనది. ఇది ప్రేమాలింగనము కంటెను మధుభరితమైనది. *

1093. ఆమె నన్నుచూచి సిగ్గుచే తలవంచెను. అదియే మామధ్య మొలకెత్తిన ప్రేమాంకురమునకు జలాభిషేచనము.

1094. నే నామెవైపు చూచునపు డామె నేలవైపు చూచును. నే నిటునటు చూచునపు డామె నావైపుచూచి చిరునవ్వు లొలికించును.

---

* ఆది ప్రియురాలి తదితర విలాసములకంటె నెక్కుడు సౌఖ్యము నొసంగును.

1095. ఆమె నన్ను చూచుచున్నట్లే కాన్పించదు. కాని ప్రక్క చూపులతో నన్నుచూచి పులకాంకితమైనవక్షఃస్థలముతో మందస్మితమొనరించును.

స్వ గ త ము (తనలో)

1096. ప్రియులేమియు నెరుగనివారివలె చమత్కారమైన తిరస్కార సంభాషణలను చేసిన చేతురుగాక. వారి ప్రేమ సంభాషణము నిముసములో పట్టుబడక మానదు.

1097. కోపము, తీక్ష్ణవీక్షణము, నిందాగర్భ సల్లాపము— మనస్సులో ప్రేమించుకొనుచు పైకి తిరస్కరించునట్లు నటించు వారి శృంగారచేష్టలు.

1098. ఆ తనుగాత్రి నా ప్రార్థేయపూర్వక దృక్కులకు ద్రవించి చిరునగవు వహించును. అది యామె కొక నూతన శోభ, నాకు వరప్రసాదము.

చె లి క త్తె (ప్రక్కగా)

1099. క్రొత్తవారివలె ప్రియులెట్లు కలుసుకొని విడిపోవుదురు! వారికండ్లలో కాన్పించు నిశ్చింతయే వారి యంతరంగ ప్రేమకు, నిండుతనమునకును తార్కాణము.

1100. నేత్రములు నేత్రములకు పరస్పరాంగీకారమును భాషించుచుండునపుడిక వాగాడంబర మెందులకు!

# 111 వ యధ్యాయము

## ప్రథమ సమాగమ వర్ణన

## నా య కు డు

1101. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ పంచకము ప్రసాదించు సంతోషము నొక్కచోటనే కంకణ క్వాణశోభిత యగు నీ సుందరియొక్క తెయే వర్ణించుచున్నది.

1102. ఏవ్యాధికైనను దాని కారణమే దానికి చికిత్స కాజాలదు. కాని యీ యువిద కావించు తాపజ్వరము నీమె మాత్రమే నివారణ చేయగలదు. ఆమెయే వ్యాధి ; దాని కామెయే యౌషధము.

1103. నీ వధూ కరపల్లవశోభకంటె తోయజనేత్రుని సృష్టి మధుతర మైనదా ?

1104. ఆమెయెడబాటు నన్ను దహించివేయును. పార్శ్వవర్తి యైనపు డామె సుఖాస్పద శైత్యము నవలంబించును. ఆహా ! ఈ హిమశక్తి కా దాహశక్తి యెచ్చటినుండి ప్రాప్తించెను ?

1105. పుష్పాలంకృత కేశబంధమైన నా ప్రియురాలి జాల ము మోఘమైనది. నా హృదయ మేవిషయము నూహించునో యామె రూప మా విషయమే యైపోవును.

1106. చేలయగు నా సుందరి కరశ్రీ యమృతోద్భవ మేమొ! ఆమె కరములు స్పర్శమాత్రము చేతనే నా జర్జరితాంగముల నుజ్జీవింపజేయు చున్నవి.

1107. విఘసాశనము (అనగా యజ్ఞవిశిష్టాన్నము) నే భుజించు యజమాని గృహాజీవితమువలె నీ మంజులగాత్రి యాలింగనము పరమానందము నొనగూర్చును.

1108. పవనాంకురము నైనను మధ్య చొరనీయనొల్లని ప్రియుల పరిరంభణము పరమ సుభావహ దాంపత్య ఫలము.

1109. లేని కోపము, హృదయమార్దవము, నూత్న పరిరంభణము- ఇవియే ప్రియులనుభవించు మాధుర్యములు.

1110. జ్ఞాన మభివృద్ధియైన కొలది మానవునకు తన పూర్వజ్ఞానము పేలవమగుచుండును. కానియామె సహవాసము ననుభవించిన కొలది నా కామె మరింత ప్రేమాస్పదురా లగుచున్నది. ఆమె రసవాహిని.

## 112 వ యధ్యాయము

## ఆమె సౌందర్య స్తవము

# నా య కు డు

1111. ఓ యనిచ్ఛపుష్పమా! నీ వతికోమల మైనదానవు. కాని నాహృదయపద్మము నలంకరించిన పొలతి నీకంటె మృదులము సుకుమారము నైనదిసుమా!

1112. హృదయమా! నీవేపుష్పము చూచినను యాశ్చర్య చెందుచుండెదవు. మానవగోచరములగు పుష్పము లామె నేత్రములను పోలియుండగలవని నీవు భ్రమించెదవు కాబోలును!

1113. ఆమెచేయి వేణువునుపోలును. ఆమెగాత్రము పల్లవప్రాయము. ఆమెచిరునగవు కేవలమాణిముత్తెము. ఆమెముఖమారుతము సుగంధపరిమళభరితము. ఆమె కాటుకకన్నులు సునిశిత మదనబాణములు.

1114. ఇందీవరములచంద మామెకంటిసొంపు కెనరాక నిట్టూర్పు విడుచుచు నామెనుచూచునపుడెల్ల తలవాల్చుకొనును.

1115. ఆమె యనిచ్ఛపుష్పములతో నలంకరించుకొని నపుడు వృంతములను కూడ తురుముకొనెను. ఈవృంతముల భారముచే నామెకౌ నల్లలనాడి యపుడే విరుగునేమో యనిపించెను. *

1116. చంద్రమండల మేదియో యామె ముఖమండల మేదియో వివేచింపనేరక నక్షత్రములు తమతమ స్థానముల నుండి పరిభ్రమించుచున్నవి.

---

* అనిచ్ఛమనునది యొకజాతిపుష్పము. ఇవి పుష్పము లన్నిటికంటె మృదువైనవని తేలికయైనవని ప్రతీతి. ఈపుష్పములకుండు తొడిమల భారముచే నామె కోమలశరీరము పీడింపబడునని భావము.

1117. కాని క్షైణ్యాభివృద్ధులను నిత్యోపద్రవమునకు గురి కావలసిన చంద్రమండలమున కున్నకళంక మీ నిత్యకళ్యాణీ ముఖమండల మెరుగదు.

1118. చందురుడా ! ఈ మనోహరాంగి ముఖమండలము వలె ప్రకాశింపగలిగినయెడల నేనునిజముగ నిన్ను ప్రేమింతును. నీవప్పుడు ధన్యుడవే యగుదువు.

1119. హిమకరుడా! సుమనేత్రియగు నాసుందరివదన సరో జముతో తలపడగోరుదువేని నీవందరికు చూపట్టక నాకొక్క నికి మాత్రమే ప్రకాశింపుము.

1120. అనిచ్ఛపుష్పము, హంసతూలికకూడ యీ ముద్దియ పదకంజములకు పల్లేరుకాయలే యనదగును.

## 113 వ యధ్యాయము

## ప్రేమమహిమాభివర్ణనము

## నాయకుడు

1121. భాషను విరమింపజేసిన యీయువిద యధర బిందు వులు మధు, క్షీర మిశ్రిత చందమును తెలుపుచున్నవి.

1122. దేహి దేహములకు గల ప్రేమ మహిమాన్వితమై నది. కల్లకపట మెరుగని యీబేలయందుగల నా ప్రేమయు నంతటి మహిమగలది.

1123. ఓకనీనికాబింబమా! నీస్థానమును వీడుము. నా ప్రియురాలికచ్చట స్థానమునిమ్ము. ఏలనందువా? ఆమె కర్హ మగునాశ్రయ మింకొకటిలేదు.

1124. ఆమె సాన్నిధ్యమే నాకుప్రాణము. ఆమె యుపాంత రాహిత్యమే నాకు మృత్యువు.

1125. చారునేత్రియగు నీకన్నియ సుకృతరాశిని నేను స్మరింప గోరుచుందును. కాని దేనినేని స్మరించుటకు పూర్వము మరచిపోవలెను గదా! నేనామె సుకృతములను మరచుటెట్లు!

## నాయిక

1126. అతడు నాకన్నులనుండి నాకయి తొలగడు! నేను కండ్లు మూసికొందును. అయినను నతడచ్చటనే నిరపాయ స్థితుడై యుండును. నాప్రియుని రూపమంత సూక్ష్మాతి సూక్ష్మము. *

1127. నాప్రియుడు నిరంతరము నానేత్రములలోనే నివసించును. కనుక నేను వాటికి కాటుక పెట్టుట కూడ మానివేసితిని. ఆనిమిషములో గూడ నతడు నాకన్నులనుండి తొలగుట నాకిష్టములేదు. ♦

1128. నాప్రియుడు సదా నా హృదయసదనమందే నివసించును. కనుక తీక్ష్ణవస్తువులను భుజించినచో నవి

* ప్రియుడామె కంటియందే యాసీనుడై యున్నాడని భావము.

♦ కాటుక పెట్టినపుడు కండ్లు కొంతతడవు మూసికొనిపోవును.

యతని నచ్చట దహించునేమో యని నేనెంతయు వెఱచు చుందును.

1129. రెప్ప వేసినచో నతని మూర్తిని చూడకుండవలసి వచ్చునని నేను రాత్రులు రెప్ప వేయకుందును. ఈకారణముచే గ్రామప్రజ లతనిని క్రూరుడని నిందింతురు. *

1130. అతడు నాహృదంతరాళమున మనోజ్ఞరీతుల నధివసించుచు దానిని వీడకుండును. అయినను వెఱ్ఱిప్రజలతడు నన్ను విడిచిపెట్టెనని క్రూరుడని నిందింతురేల !

## 114 వ యధ్యాయము

### వినయాతిక్రమణము

## నాయకుడు

1131. విరహబాధితుల తాపము నుపశమింపజేయుటకు తాటియాకుల గుఱ్ఱము నెక్కించుట తప్ప వేరుమార్గము లేదు. ♦

---

* అతఁడామెను త్యజించుటచే నామెకు నిద్రపట్టుట లేదని ప్రజలు భావించి యతనిని నిందించుచున్నారని భావము.

♦ నాయకుడు తన ప్రేమను బంధుబాంధవులకు తెలియబరచుట కిదియొక ప్రాచీనసాంప్రదాయము. తాటియాకులతో నొక గుఱ్ఱము తయారుచేసి దానిమీద నతనిని కూర్చుండబెట్టి ప్రణయగీతములతో స్నేహితు లతని ప్రేమను వెల్లడింతురు.

1132. దేహి దేహములు రెండు ఈ బాధ భరింపనేరక పై విధానమును నిర్ణయించినవి. అవి వినయమును పోనాడినవి.

1133. వినయము, పౌరుషము, నా పూర్వధనములు. కాని యిప్పుడవి ప్రేమాగ్నిచే తప్తమైపోయినవి. నా కిప్పుడు తాటి యాకుల గుఱ్ఱమే శరణ్య మయ్యెను.

1134. నా హృదయ కల్లోలమును నే నెట్లు చెప్పుకొన గలను ? నే నింతవరకు వినయధైర్యము లనునావ నాశ్రయించి తిని. నే డది కామప్రవాహవేగముచే కొట్టుకొని పోయినది.

1135. కంకణ ధారియైన యీ సుమగాత్రి నా కీ తాళ వృంతము నిశాతాపము సమర్పించెను.

1136. ఆమెపై ధ్యానముచే నా కండ్లకు రెప్పపాటు లేక యున్నది. కనుక నే జగత్తంతయు నిద్రావివశమైయున్న యీ నిశీథమందు నేను తాళవృంతము నధిరోహింప గోరు చుంటిని.

1137. అపారరాగ సముద్రముచే తపించుచున్నను తాటి యాకుల గుఱ్ఱము నెక్కకుండ తన్ను తాను నిలువరించుకొన గలిగిన యీ తమ యాత్మనిగ్రహ మతి మహత్తరమైనది కదా !

## నా యి క

1138. ఆహా ! రాగమా ! నా వినయసంపదను, నీ యెడల నాకుగల కరుణాస్వభావమును కూడ యోచింపక నాత్మ ప్రక టనముచేసి వు నా రహస్యమును వెల్లడి చేయుచుంటి వేల ?

1139. నా రాగము తన్నెవ్వరు చూచుట లేదనుకొని స్వైరవిహారము చేయుచు వీధులలో తనకు తాను ప్రదర్శించు కొను చున్నది.

1140. మూర్ఖులు నా మొగముమీదనే నన్నెగతాళి చేతురు ; వెక్కిరింతలు కొక్కిరింతలు ప్రారంభింతురు. నే ననుభ వించు తాపము వారికేమి తెలియును ?

## 115 వ యధ్యాయము

### ప్రజాపవాదము

## నా య కు డు

1141. మారహస్య సమాగమమును గురించి గ్రామములో గుసగుసలు చెలరేగిన కొలది నాయవయవముల నుండి లేచిపో యిన ప్రాణములు తిరిగి నన్నాశ్రయించుచున్నవి. చాలమంది కీరహస్యము తెలియక పోవుటకూడ నాయదృష్టమే.

1142. నాప్రియురాలి గుణసౌరభము నెరుగక తమగుస గుసలచే ఆయాణిముత్తెమును, దరహాసిత పుష్పవిలాస నేత్రిని, పొందశక్యముకాని రత్నమును ప్రజలు నాకతిచౌకగ సమ ర్పించిరి.

1143. ఈ ప్రజాజల్పమెంత యమూల్యమైనది ! ఆమెను పొందక పోయినను ఈవాదుచే నేనిపుడామె పరిరంభణ సౌఖ్యము ననుభవించుచున్నాను.

1144. ఈగ్రామాపవాద నాకామెయెడగల ప్రేమను మరింత ప్రజ్వరిల్ల జేసినది. ఈవాదే లేనిచో నా ప్రేమ యింత రసోద్దీపక ముగ నుండెడిది కాదు.

1145. త్రాగిన ప్రతిపానపాత్ర త్రాగుబోతు పిపాసను మరింత వృద్ధి చెందించును. అట్లే యీగ్రామప్రజల ప్రతి గుసగుస ప్రియురాలియందు నాకు మరింత మాధుర్యమును హెచ్చించును.

## నాయిక

1146. ఒక్కపర్యాయమే మేము పరస్పరము వీక్షించు కొంటిమి. కాని దానిమీద బయలుదేరిన పరివాదము రాహు గ్రస్త రాకాసుధాకరుని కొరకు గావింపబడు కోలాహలమువలె నున్నది. *

1147. ప్రజాపవాదమే దోహదక్రియ. మాతృదూషణమే జలాభిషేచనము. ఈ రెండును నా తాపమును మరింత ప్రజ్వరిల్ల జేయుచున్నవి.

1148. ఈ యపవాదముద్వారా నా రాగమును నశింపచేయ బూనుట నిప్పును నేతితో చల్లార్పగోరుట వంటిది.

1149. "భయపడకుము" అని నా కభయదానము చేసిన నాడే నన్ను ప్రజాదూషణలకు విడిచివేసినపుడు నేనీ నీలాప నిందలకు సిగ్గుపడనేల ?

---

* చంద్రగ్రహణము పట్టినప్పుడు ప్రతివారు ఇల్లు విడిచి బయటకు వచ్చెదరు.

1150. ఈ ప్రచారమును నాహృదంతరాళమున నేనెంతయో యభిలషించుచుంటిని. గ్రామప్రజలు దీనిని నా కొరకే లేవదీసిరి. ఇప్పుడు నిశ్చయముగ నా ప్రియుడు నా ప్రార్థనను తిరస్కరింపడు.

గాంధర్వ వివాహ మను శీర్షిక గల
మూడవ భాగములోని
మొదటి పరిచ్ఛేదము సమాప్తము.

---

# రెండవ పరిచ్ఛేదము



పాతివ్రత్యము

116 వ యధ్యాయము

విరహావేదన

## నాయిక

1151. నన్నెడబాయు మాట నాకు చెప్పవలదు. వెంటనే తిరిగి వత్తునందువా! ఆ మాట లంతవరకు జీవించియుండు వారికే చెప్పదగును.

1152. ఒకప్పు డతని దర్శన భాగ్యమే నాకు స్వర్గముగ నుండెను. ఇప్పుడో! అతని గాఢాలింగనము కూడ విచార కలుషితమైనది. ఇప్పు డతడు నన్నే నిమిషమున వీడిపోవునో యను భయము కలుగుచున్నది.

1153. అతడు నన్నెన్నడు వీడనని బాసచేసినాడు. దాని విపరీత ఫలితము కూడ నత డెరుగును. ఈ మర్మము నెరిగిన వాని హృదయములోనే నన్నెడబాయు తలంపు దాగియున్నపుడిక నేనేమందును? నా కిచ్చిన యభయహస్తమును భంగ పరచిన వానిని నమ్మెదనా!

1154. “భయపడకుము. సంతోషస్వాంతవు కమ్ము. నిన్ను నేను వీడను” అని యతడు నన్నాశీర్వదించెను. అట్టివాడు నన్నెడబాయ తలంచు టతని దోషము. అతని పవిత్ర వాగ్దానము విశ్వసించుటలో నా దోష మేమున్నది ?

1155. చెలీ ! నీవు నా ప్రాణములు నిలుపగోరుదువేని నా ప్రాణనాథుని పోవలదని యాపుచేయుము. అతడు నన్ను వీడునేని తిరిగి వచ్చువరకు జీవింతునను నాస నాకు లేదు.

1156. “నేను పోక తప్పదు” అని నా ముఖము మీదనే చెప్పగలిగినవాని కాఠిన్యత నేమందును ? అట్టి నిర్దయుడు నా ప్రాణములు నిలుపుటకు తిరిగి వచ్చునా ? నా దుఃఖము నపనయించి నన్నానందాబ్ధి నోలలాడించునా ? ఇది వట్టి కల్ల !

1157. నా మణికట్టునుండి జారిన కంకణము లప్పుడే నా నాథుని వియోగఫలితమును ప్రదర్శించుచున్నది. *

1158. ప్రాణమిత్రులులేని యెడారిజీవితము జీవించుటే దుర్ఘటము. ఇక ప్రాణనాథుని యెడబాటు మృత్యుసమము కాదా ?

1159. స్పర్శించినపుడే యగ్ని దహింపగలదు. కాని ప్రేమ దూరమున నుండియే దహించివేయును. కనుక ప్రేమకు గల దాహశక్తి యగ్ని కెంతమాత్రము లేదు.

1160. ఏమనియెదవు? విరహవేదనభరించి ప్రియుడు తిరిగివచ్చునను నాసచే జీవింపగలవారు చాలమంది యుందు రనియెదవా?

---

* ప్రియుని యెడబాయు ననుభావము తట్టగనే యామె దుఃఖ మతిశయించి శరీరము శోషించుటచే కంకణములు జారిపోవుచుండె నని భావము.

## 117 వ యధ్యాయము

### విరహవేదన

### శరీరము శుష్కించుట

## నాయిక

1161. అయ్యో! నేను నాదుఃఖము నీ నిమిషమువరకు నణచిపెట్టు కొనుచు దినములు గడుపుచున్నాను. కాని తోడిన కొలది యూరుచుండు నిరంతరజలవలె నిది మరింత పైకుబుకు చున్నది.

1162. నేను నారాగమును, దుఃఖమును నిక దాపజాలను. అది వ్యక్తమగుచున్నది. కాని దానికారకుడైన వానియెదుట దానిని ప్రదర్శించుట సిగ్గుచేటని నేను భావింతును.

1163. ప్రేమచే క్షోభించు హృదయము నొకవంక సిగ్గు మరి యొకవంక దుఃఖము క్రుంగదీయుచున్నవి.

1164 ఇపుడు మామధ్య నొకదుఃఖసంద్రము దాపురించినది. దీనిని తరింపజేయు దివ్యనౌక నాకేదియు కాన్పించుటలేదు.

1165 నేనిట్లు కృశించిపోవుటకు నామిత్రుడే యొడబడి నపుడు – మిత్రుడే శత్రువైనపుడు – ఇక నతడేమిచేయకుండును!

1166. ప్రేమ ప్రసాదించు సంతోషామృత మపార పారా వారము వంటిది. కాని యది దహింప మొదలుపెట్టినచో బడబాగ్నివలె కాల్చివేయును.

:1167. నేను కల్లోలితప్రేమ సాగరతరంగములలో చిక్కుకొని దిక్కులేకచక యిటునటు కొట్టుకొనుచుందును. కటికి రాత్రులందు నే నేకాకినై బిక్కుబిక్కుమను ప్రాణముతో నుందును.

1168. చరాచర సమస్తప్రపంచమందు దయగల నిశాదేవి ప్రాణిలోకమునంతను నిద్రపుచ్చి జోకొట్టును. కాని నేను తప్ప చివర కామెతో సహవసించువా రింకొకరుండరు. *

1169. ఆహా! ఈపాడురాత్రి నేడెంత మందమందముగ గతించుచున్నది. ఇదినాపట్ల యానిర్దయాత్మునికంటె నెక్కుడు క్రౌర్యము వహించుచున్నది.

1170. నాహృదయ మతనిచెంత కెంత రయమున పరుగెత్తుచున్నది? అట్లే నాకన్నులుకూడ పరుగెత్తగలిగిన యెడల నవి యీబాష్ప సముద్రములో నీదులాడవలసిన యగత్యముండెడిది కాదుకదా!

## 118 వ యధ్యాయము

### అతని నన్వేషింపలేక కన్నులు క్షీణించిపోవును

### నాయిక

1171. నాకన్నులు నేడు నాకు మొఱపెట్టుకొని ప్రయోజన మేమి? అవి ప్రియునినాకు చూపించుటచేతనే నాకీ యవిరళ దుఃఖము ప్రాప్తించినది.

---

* నేనుతప్ప లోకమంతయు నిద్రించును. నేను మేల్కొనుటచేనిశా దేవికి సహవాసిగనుండి యామెపనులను నెరవేర్చుకొనుటలోతోడ్పడుదును.

1172. ఆనాడు ప్రియునంతటి సాహసముతో చూచిన స్వయం కృతాపరాధ ఫలితము నోర్పుతో సహింపక నేడవి యిట్లు విలపింపనేల ?

1173. అవి స్వబుద్ధిచేతనే నాడతనిని చూచి నేడు తమంత తామే విలపించుచు నెంతటి పరిహాసమునకు పాల్పడినవి!

1174. నాకాచిచ్చుపెట్టి తీరనిదుఃఖమును సమర్పించి కండ్లు తమ బాష్పకోశమును రిక్తచేసికొని నేడు శోషించిపోయినవి.

1175. పారావారమును మించిన దుఃఖసముద్రములో నన్ను ముంచి నాకండ్లిపుడు దుఃఖతప్తమై తామే నిద్రింపలేకున్నవి.

1176. నాకీ దుఃఖమును తెచ్చిపెట్టి తామే యీపరితాపమునకు గురియైన నాకండ్లకు తగినశాస్తి జరిగినది!

1177. నాడతని రూపసౌందర్యము నంత యాప్యాయముగ మదభరితముగ సమస్తమును దిగమ్రింగు ప్రేమతో చూచిన కండ్లు శపింపబడుగాక!

1178. తమ్ము ప్రేమించువారు లేకపోయినను ప్రేమించు వారుందురుకదా! తమ్ము మోసగించి పోయినవానిని చూడ లేక నాకండ్లు నిద్రనెరుగక యున్నవి.

1179. నానాథు డెదుట లేనపుడు నాకనులు నిద్రింపవు. అతడు తిరిగి వచ్చినను అవి నిద్రింపవు. నిరంతరబాధ ననుభవించుటయే వాని కర్మఫలము.

1180. మనకన్నులే మనలను చాటించు మద్దెలలైనప్పుడు (నాకన్నులవలె) అవి దాచిపెట్టగోరు రహస్యము నెంతక్రొత్త వారైనను గ్రహించుటంత కష్టము కాదుకదా!

## 119 వ యధ్యాయము

### ప్రేమఫలిత పాండురమునకు పరితపించుట

## నా యి క

1181. అతని యెడబాటుకు నేనేసమ్మతించి యిపుడీ వైవర్ణ్యమును గురించి నేనెవరికి చెప్పుకొందును?

1182. ఈపాండురమతని వైద్యమగుటచే నెంతయో గర్వించుచు నాశరీరమంతయు ప్రాకి నాపై యాధిపత్యము వహించుచున్నది.

1183. నా వినయమును నా యందచందములను అతడు తనతో తీసికొనిపోయి నాకీపాండురోగమును హృదయ పరితాపమును ప్రసాదించినాడు.

1184. అతనిచింత తప్ప నాహృదయమన్యచింత నెరుగదు. అతని కథలనే తప్ప నా నాలుక యన్యకథాను లాపముల నెరుగదు. అయినను నీపాండిమము నాశరీరము నలముకొనుటొక యింద్రజాలమేమో!

1185. ఆనాడాతడు నన్నింకనువీడెనో లేదో నాకు పాండుర మారంభించెను. *

1186. దీపమెపుడారునా యని చీకటిపొంచియుండి విజృంభించునట్లు నా నాథుని యెడబాటుకొరకే పాండుర మెదురు చూచుచుండెను.

1187. ఒకనాడు నేనతని యాశ్లేషసుఖము ననుభవించుచు లిప్తమాత్ర మతనిని వీడితిని. చిత్రము! ఇంతలోనే పాండురోగము నన్ను మ్రింగినట్లయ్యెను.

1188. 'చూడుడు! చూడుడు!' ఆమె పచ్చబారినది. పాలిపోయినది! అని యందరునన్ను దెప్పువారేకాని నన్నెడబాసినందుల కతని నెవరును దూషింపరేల?

1189. సరే! సరే! చెలీ! అతని కపకారబుద్ధి యెంతమాత్రము లేదని నీవనియెదవు. యమసదృశమైన నాయీశరీర పాండురము నీకొక లెక్కకాదు కాబోలును!

1190. నాశరీరము పచ్చబడిన దని పాలిపోయినదని నన్ను దెప్పినను నాప్రియుడు క్రూరుడని ప్రజలు నిందింపకుందురేని నాకదియే పదివేలు. ♦

* ప్రియుడు దూరదేశమునకు పోలేదనియు నతడు త్వరలోనే వచ్చునని నను నూరడిల్లఁజెలివనియు చెలికత్తె చెప్పగా నామె యీసమాధానము చెప్పినట్లు భావింపవలెను.

♦ ఆమె భావము లెంత శరవేగముతో పరుగులిడుచున్నవో చూడుడు.

## 120 వ యధ్యాయము

## తనవలె భర్త తనను ప్రేమించుట లేదని హృదయ పరితాపము

# నాయిక

1191. ఆహా ! ఎంత దురదృష్ట వంతురాలను ! ప్రేమించిన వారిచే ప్రేమింపబడు వారొక్కరే మధురాతి మధురమగు (పాషాణరహిత) ప్రేమఫలము ననుభవింతురు.

1192. సర్వప్రపంచమునకు వర్షమెంత యహ్లాదకరమో ప్రియురాలికి ప్రియుని కరుణారసవృష్టి యట్టిది. కాని నానాథుడింకను రాడాయెను.

1193. ప్రియునిచే ప్రేమింపబడువారొక్కరే తమ సౌఖ్యమునకు గర్వింప దగుదురు.

1194, ఇతరు లెంతయుంచి మనల నెంతగా ప్రేమించినను లాభమేమి ? తాము ప్రేమించినవారి ప్రేమను పొందనప్పుడీ ప్రపంచములో కాంతలకిక సౌఖ్య మెక్కడ ?

1195. నే నతనిని ప్రేమింతును. నన్నతడు ప్రేమింపడే ! ఇక నే నతనినుండి యేప్రసాదము నాసింపగలను ?

1196. కావడిబద్ద కిరువంకల సమముగ నున్నపుడే భారము సుఖావహముగ నుండును. అదియొక వైపునే యున్న యెడల దుస్సహమగును.

1197. మన్మథుడు నన్నొక్కతెనే బాధించుచున్నాడు. నా దుఃఖములను బాధలను చూచుట కతనికి కండ్లు లేకపోవుటయే దీనికి కారణమా?

1198. ప్రియుని దగ్గరనుండి ప్రేమసందేశములు లేకపోయినను జీవింపగల స్త్రీలవంటి పాషాణహృదయులు లోకములో నుందురా?

1199. ప్రియుడు క్రూరుడైనను అతని యొద్దనుండి వచ్చుయే సందేశమైనను కర్ణపీయూషముగ నుండునుకదా!

1200. హృదయమా! నీకు కళ్యాణమగుగాక! నీ వలవంతలను నిన్ను ప్రేమింపనివానికి నీవు చెప్పుకొనుచున్నావు. ఇంతకంటె సముద్రము నింకింపజేయుటకు నీవు యత్నింపరాదా?

## 121 వ యధ్యాయము

### పియురాలి కొరకు నిట్టూర్పు

## నా య కు డు

1201. స్మరణ మాత్రముననే ప్రేమ యంతులేని సుఖము నొసగూర్పగలదు. కనుక మధువుకంటె ప్రేమ మధురమైనది.

1202. మనోగోచరమైన నిమిషమందే ప్రియురాలిరూపము నాదుఃఖము నంతను పటాపంచలుచేయగలదు. ఆహా! ప్రేమ యేరూపములోనైనను ప్రియమైనదేకదా!

# నా యి క

1203. పులకమారి యాగిపోయినదే! అతడు నన్ను తలచుకొనబోయి మానివేయుటయే దీనికి కారణమా? *

1204. అతడు నాహృదయములో సదా కాపురము చేయుచున్నాడు. అతని హృదయములో నాకావంతయైన స్థానమున్నదా? *

1205. అతడు నన్ను తన హృదయమునుండి వెలివేసినాడు. అట్లుచేసి నాహృదయములో నిరంతరము కాపురముండుట కతనికి సిగ్గులేదు కాబోలును!

1206. తిరిగిరాగలడను నాసచేతనే నేనింకను జీవింపగలిగియున్నాను. అది తప్ప నాజీవితములో నిక మిగిలినదేమున్నది?

1207. నాహృదయ మతనితో నిండియున్నను నాయంతరంగము నన్ను దహించుచునేయున్నది. నేనతనిని మరచిపోవలసినచో నిక నాగతి యేమికావలెను? ♦

1208. అతనిని నేనెన్నిసారులు స్మరించుకొనినను నాపై కినుక వహింపక నాకలలోనికి వచ్చుచునేయున్నాడు. నామీద నత డంతమాత్రమైనను దయప్రసాదించుట నాయదృష్టము.

---

* స్నేహితులో బంధువులో తలచుకొనినపుడు పులకరించునని భావన.

♦ స్మరించుచుండుటచేతనే నీదుఃఖము హెచ్చుగు కలుగుచున్నది. కనుక నీవని కొంతకాల మేల మరచియుందువు? అని చెలి యన్నట్లు దానికి సమాధానము నాయిక చెప్పినట్లు భావింపవలెను.

1209. " మనమిరువురము కాదుసుమా! ఒకే జీవితము ఒకేయాత్మ " అని నాతో నొకమారు నమ్మబలికినాడు. ఇప్పుడతని క్రూరత్వమును నాహృదయము తలచుకొనినపుడు నిశ్చయముగ నాప్రాణములే లేచిపోవుచున్నవి.

1210. చంద్రుడా! నాహృదయములో నెల్లపుడు నివసించుచున్నను నాకుదూరముగనున్నవాని ముఖకమలమును నా నేత్రములు తిరిగిచూచువరకు నీవాకసమునుండి యస్తమింపరాదుసుమా!

## 122 వ యధ్యాయము

## స్వప్నస్తుతి

## నా యి క

1211. నాప్రియుని ప్రేమ సందేశము తెచ్చిన స్వప్నలోకమును నేనెట్లు బహూకరింపగలను?

1212. నిద్రపోవునట్లు నానేత్రములను నేను బుజ్జగింపగలిగిన యెడల స్వప్నములో నేనతని వజ్జకేగిరి జీవితమునకు నేనంటిపెట్టుకొనియున్న గాధను వెల్లడింతును.

1213. జాగ్రదవస్థలో మోముచూపనివానిని స్వప్నములో చూచుచుండుటచేతనే నేనింకను ప్రాణములను ధరింపగలుగుచున్నాను.

1214. స్వప్నము ప్రేమ సుఖములను నాకు ప్రసాదించుచున్నది. జాగ్రదవస్థలో నన్ను కరుణింపని వాని నది నాచెంతకు తెచ్చుచున్నది.

1215. ప్రియుడు కన్పించునంతకాలము స్వప్నము సంతోషదాయకముగ నుండునుకదా! జాగ్రదవస్థకు మాత్రమంతకంటె విశేషమేమికలదు ?

1216. ఆహా! జాగ్రదవస్థయే యికలేకుండునుగాక. అప్పుడు నాస్వప్నమవిచ్ఛిన్నముగ సాగుచు ప్రియుడు నన్నెడబాయకుండును.

1217. నేను మేల్కొనినపుడు నన్నాదరించని క్రూరుడు నా కలలలో నన్నేల వెంటాడింపవలెను ? *

1218. నేను నిద్రించునపుడతడు నన్నాలింగనముచేయును. నేను కండ్లు తెరచిచూచుసరి కతడు నాహృదయములోనికి పరుగెత్తును. ♦

1219. నావలెనే స్వప్నలోకములో తమప్రియులనుచూచు కాంతాలలాములున్నచో నన్నతడు కలుసుకొనుటలేదని నిందింపరు కదా !

1220. నన్నతడు విడనాడినాడని యీ గ్రామవాసులు చెప్పుకొందురు. అతనిని కలలలో చూడలేక వారట్లనుచుందురు.

* భావము అతిత్వరగా మారిపోవుచున్నది

♦ ఆతడు తన్నాలింగనము చేసికొనినట్లు కలగనును.

123 వ యధ్యాయము

సాయంసమయము - వేడినిట్టూర్పు

# నా యి క

1221. సంధ్యాదేవీ! గూండ్ల కేతెంచు పక్షుల కిలకిలలతో చక్రవాకాదుల ప్రేమరుతములతో నీ వొకప్పుడు శుభంకరుడవు. ఇప్పుడు నీవు నా పాలిట కాలుడవు.

1222. ఓహో! నీవుకూడ శోకతప్తవై వెలవెల బారినట్లు కాన్పించుచున్నావు. చెలీ! నా ప్రియునివలె నీ ప్రియుడు కూడ క్రూరుడేనా?

1223. హిమకణార్ద్రమై వణుకుచు నా చెంతచేరెడి సంధ్య యిప్పుడు నాపై కతిసాహసముతో వచ్చుచు నాకు దుఃఖనైరాశ్యములను తెచ్చిపెట్టుచున్నది.

1224. ఉరితీయు జెట్టి యురికంబమునకు వచ్చు రీతిగా సంధ్య ప్రోషితభర్తృకపై కురుకును.

1225. ప్రాతఃకాలమునకు నేనేమి యుపకారము చేసితిని. సంధ్యకు నేను గావించిన యపకారమేమి?

1226. ఆదిన మెంత పాపిష్టిదినము. ప్రియుడు నా చెంతనున్నపుడీ సాయంకాల ప్రతాప మెచ్చటకేగెనో!

1227. ప్రాతః కాలమున మొగ్గయై పగలంతయు తన దళములను విప్పుచు సాయంతన మగుసరికి పూర్ణరూపము

పొందు పువ్వువలె నీ వ్యాధి పగలుపొటమరించి రాత్రి యగు సరికి నా మీదకు విజృంభించును.

1228. అది వ్రజబాలుడు పూరించు వేణువా? కాదు. కాదు. నా ప్రాణమున కది 'వజ్రాయుధము. ఏలనందువా? నన్నత్యంతము తపింపజేయు సాయంతనము నది తెచ్చిపెట్టు చున్నది.

1229. నా కిదివరకే పిచ్చి పట్టించి సంధ్య యిక నేమా త్రము ముందుకు సాగినను పట్టణ మనతికాలములోనే దుఃఖ ములో మునుగును. నాకు మరణమే ప్రాప్తించును.

1230. ప్రాణములు నన్నింకను ఆశ్రయించుకొని యున్నవి. ధనయశస్సుల నార్జించుటకై నన్ను విడనాడి దూర దేశమున కేగిన నా నాథుని విరహాబాధ చీకటి ముదిరినకొలది నన్నలమ టింపగా నా కున్మాదము, మూర్ఛ, మృత్యువు సంభవించును.

## 124 వ యధ్యాయము

### ఆమె సుకుమార గాత్రము క్షీణించును

### నా యి క

1231. నాసౌఖ్యాభివృద్ధికొరకే వెళ్లుచుంటినని యతడనెను. అతనిని గురించి నాకండ్లు చింతించుచున్నవి. ఒకప్పుడు పుష్ప

ముల నధఃకరించిన నాకండ్లిపుడు వాటిని చూచుటకు సిగ్గుపడు చున్నవి. *

1232. కన్నీటి కాలువలచే కాంతిదొరగిన నా కండ్లు నా ప్రియుని క్రౌర్యమును చాటుచున్నవి.

1233. పరిణయోత్సవమునాడు సంతోషముతో నుప్పొంగిన నాకరద్వంద్వ మిప్పుడతడు నన్నెడబాసినట్లు ప్రపంచమునకు చాటుచున్నది.

1234. విరహతాపముచేత తమ దర్పమును కోల్పోయిన కరము లిపుడు శుష్కించినవి. కంకణములు తమంతతామే చేతులనుండి జారిపోయినవి.

1235. తమ నైసర్గికశోభను కోల్పోయిన కరములు, నవి ధరించిన కంకణములు కలసి యాక్రూరుని క్రౌర్యమును ప్రపంచమునకు ముక్తకంఠముతో చాటుచున్నవి.

1236. అతడు క్రూరుడని ప్రజలునిందించుచున్నారు. కనుక క్షీణించిపోయి మురుగులను జారనిచ్చిన నాచేతులను నేను మందలించు చున్నాను.

1237. హృదయమా! నీకుకీర్తి కావలెనందువా? అట్లయి నచో నీవాక్రూరుని దగ్గరకు పరుగిడి శోషితాంగములచే నాకు కలిగిన దైన్యము నతనికి వివరింపుము.

---

* అసంభవ విషయము లన్ను నమ్మనందుల కవితపించుచున్నవి.

# నాయకుడు

1238. ఒకనాడు మేము గాఢాలింగన సౌఖ్యము ననుభ వించుచుంటిమి. నాచేతు లొకింతగ జారినవి. వెంటనే యామె ఫాలభాగము వివర్ణమై వెలవెలపోయినది.

1239. మేము పరిష్వంగసుఖము ననుభవించుచుండ నొక ధూర్తవాత శకలము మామధ్యగ చొరచు కొనిపోయెను. తోడనే యామె విశాలనేత్రములనుండి రక్తము తొలగి వారి పూరితమేఘమువలె నయ్యెను.

1240. నేత్రములు వివర్ణమగుటతో విరామము చెప్పు కొనెనా ? లేదు. అవి నిగనిగకాంతు లుడిగినయామె నిద్దంపు ఫాలభాగమును చూచి వలవల యేడ్చెను.

## 125 వ యధ్యాయము

## హృదయసంబోధన

# నాయిక

1241. హృదయమా ! నేనీబాధ భరింపజాలను. వ్యాధి కేదేని చికిత్సచూపవా ?

1242. హృదయమా ! నేను నీశుభమును వాంఛింతును. అతనికి నీయెడల ప్రేమలేదు. ప్రేమలేనివానికొరకు పరితపించుట నీమూర్ఖత్వముకాక మరేమిటి.

1243. మానమిచ్చుటనుండి యతనిని తలపోసికొనుచు క్షీణించిపోవుటవలన లాభ మేమి? మనకీదుఃఖమును కలిగించిన వాడు మనలను స్మరించుటలేదే.

1244. హృదయమా! నీవతనిదగ్గరకు పరుగిడుదువా? నీతోకూడ ఈకండ్లనుకూడ తీసికొనిపొమ్ము. అవియతనిని చూడ గోరుచు నన్నుతినివేయుచున్నవి.

1245. మన మతనిని విడువకున్నను అతడు మనలను తిర స్కరించుచున్నాడు. కనుక మనకతడు శత్రువని భావించి విడువగలమా?

1246. ఓహో! సమాధాన వచనరచనా చతురుడగు ప్రియునిచూచి నీవు సమస్తము మరచిపోదువు. నీకోపమును కూడ మరచి నీవతని నాలింగనముకొరకు పరుగెత్తుదువు. ఇప్పుడును నీకోపము నటనయేయని నేను భయపడుచున్నాను.

1247 హృదయమా! నీవు నీప్రేమనైనను విడిచిపెట్టుము. లేదా నీసిగ్గునైనను విడిచిపెట్టుము. ఈరెంటిని యేకకాలమందు భరించుటకు నేనుసమర్థురాల నైతిని.

1248. జాలిచే కరగినైనను అతడు తిరిగిరాడేయని నీవు నిట్టూర్పువిడుచుచున్నావు. బుద్ధిపూర్వకముగ నిన్నుత్యజించి నను అతనిని నీవు వెతుకబోదువు. నిశ్చయముగ నీకాత్మగౌర వము లేదు.

1249. ఎంతవింత! ప్రియుడు నీయంతరంగమందే యాసీనుడై యున్నాడని తెలిసియు నీవెవరిని కలియగోరుదువు?

1250. మనలను సుతరాముత్యజించిన వానిని భావించుచు కృశించుట తప్ప మరియొక ప్రయోజనమేదియు కానరాదు.

## 126 వ యధ్యాయము

### ఓరిమి సడలును - బిడియము వీడును

## నా యి క

1251. వినయమను గడియచే బిగింపబడిన తలుపు ప్రేమ యను గొడ్డలి వ్రేటుకు లొంగిపోవు చున్నది.

1252. ఆహా ! ప్రేమ యెంత కఠోరమైనది ! అది నిశీథ మందు కూడ నా హృదయమును పీడించుచున్నది.

1253. ప్రేమను నా హృదయ కుహరములో కప్పిపుచ్చుటకు నేనెంతయో ప్రయత్నింతును. కాని తుమ్మువలె నది (నాకు తెలియకుండగనే) హఠాత్తుగ బయట పడుచుండును.

1254. నావినయమునకు ఋజుప్రవర్తనకు నేనెంతయో గర్వపడు చుంటిని. కాని నే నిపు డశక్తురాలను. ప్రేమ ప్రతిపారను చీల్చివేసి యాత్మ ప్రకటనము చేసికొను చున్నది.

1255. ప్రియుడు క్రూరుడై నన్ను విడిచి పోవును. అతని నన్వేషింప రాదను యాత్మాభిమానమును కామజ్వరితు లెరుగరు కదా !

1256. దుఃఖమా! నీకు నాపై నెంతటి యభిమానమే! నన్నతిక్రూరముగ విడిచి వానివెంట బడుమని నాకు నిరంతరము బోధింతువా!

1257. ప్రియుడు ప్రేమ కురిపించుచు మనల నాదరించుననుకో! తత్క్షణమే మనము బిడియము నంతను పోనాడుదుమే!

1258. అతడనేక కృత్రిమకళలయందు నేర్పరి. మనసును ద్రవింపజేయు ఆ మాయలమారి మాటలే మన వినయదుర్గమును కూల్చివేయుచున్నవి.

1259. కోపగించుకొని లేచిపోవలె ననుకొంటిని. కాని నాకంటె పూర్వమే నా హృదయ మతనిలో ప్రవేశించుట చూచి నే నతని నాలింగనము చేసికొంటిని.

1260. వెన్న నిప్పులో కరగునట్లు కరిగిపోవు మృదుహృదయులు తిరస్కారము నెట్లు సహింపగలరు? ఎట్లుచింతింపగలరు?

## 127 వ యధ్యాయము

### పరస్పర సమాగమోత్సుకత

## నాయిక

1261. నాకండ్లు కాంతి తఱిగి తేజోహీనమైనవి. నేను గోడమీద గీసిన గీటులను (దినములను) లెక్కించుకొనలేక నావ్రేళ్లు అలసిపోయినవి. * అతడింకను రాకున్నాడు!

* ఆమె విరహదినములను లెక్కించుకొనుటకు గోడమీద గోటితొక చుక్క పొడుచును. ఆచుక్కలను లెక్కించుకొనలేక నావ్రేళ్లలసిపోయినవని భావము.

1262. చెలీ! నేనిప్పుడతనిని మఱచిపోయిననేమి? నా యందమూ వన్నియు నరకే విడిచిపెట్టెను. నాయురుగులా చేతుల నుండి జారిపోయెను. కాదు! కాదు! ఈవిరహబాధ నాసమాధిని కూడ దాటి నన్ను వెంటాడును.

1263. విజయమును కాంక్షించుచు నతడు నన్ను విడిచి వెళ్లెను. అతడు తిరిగివచ్చునను కాంక్షచేతనే నేనింకను జీవింప గలిగియుంటిని.

1264. అతడు నాప్రార్థన నాదరింపక నన్ను మాంతముగ విడనాడెను. అయినను నతడు తిరిగివచ్చునను భావమును దలఁచినప్పుడెల్ల నాహృదయము సంతోషముతో నుప్పొంగు చుండును.

1265. కన్నులు నానాథుని రూపమును మనసార గ్రోలును గాక! కృశించిపోయిన నాచేతుల పాండురవర్ణ నిమిషమే మాయమగును.

1266. నాభర్త తిరిగి వచ్చినచాలును. ఒక్కదినమతని రూపామృతమును గ్రోలినా నాయీ దైన్యత పలాయన మగును.

1267. నానేత్రసముడగు ప్రియుడు తిరిగి వచ్చుననుకో! అతడు వచ్చినపుడంత యాలసించినందుల కతనిపై కోపము నభినయింతునా? లేక యతని నాలింగనముచేతునా? లేక రెండునుకూడ చేయనా?

## నాయకుడు

1268. రాకుమారుడు వెంటనే యుద్ధము ప్రారంభించి విజయుడగుగాత. నేనాసాయంతనమే గృహోన్ముఖుడనై నా ప్రియురాలి చెట్టబట్టి రాత్రిసర్వము ననుభవింతును.

1269. కండ్లు కాయలుకాయునట్లు భర్తకొరకెదురు చూచుచు దినములను లెక్కించు ప్రోషితభర్తృకకు దినమొక యుగముగ 'చీమ సింగాయాత్ర' జరుగుచుండునుకదా!

1270. నేనింటికి చేరులోపల నాప్రియురాలి హృదయము వ్రక్కలగుచో నేను తిరిగివెళ్లిన ప్రయోజనమేమి? అప్పుడు కాగిలించుకొనినను ఫలమేమి? కనుక నేను ముందుగనే పరుగెత్తవలెను.

## 128 వ యధ్యాయము

## రహస్యభావమును గ్రహించుట

## నాయకుడు

1271. ప్రియురాలా! నీ వెంత దాపరికము చేసిననేమి? నీవు నీ కండ్లను నిర్బంధింప జాలవు. నీ హృదయములో నొక వింతభావ ముదయించినట్లు వెల్లడి చేయుచున్నవి. *

---

* ప్రియులిద్దరు కలుసుకొందురు వారు స్వర్గసుఖము ననుభవింతురు. అతడు తిరిగి వెళ్ళిపోవునేమోయని యామె భయము.

ఆమె ప్రత్యుత్తర మీాయదు. అతడు చెలికత్తెతో చెప్పెను.

1272. ఆహా! ఇదియేమి చోద్యము. తన చక్కదనముతో నాకు నేత్రపర్వ మొనరించిన యీా కీచక పల్లవపాణి వినయము స్త్రైణమునకే యలంకారముగ నున్నది.

1273. మణిహారములో కాన్పించు సూత్రమువలె నా కిపుడామె వక్షఃస్థల సీమలో సంచరించు భావమొకటి దృగ్గోచరమగుచున్నది.

1274. పుష్పకోశములో నణగియుండు సౌరభమువలె నామె చిరునగవులో నొక రహస్యభావ మిమిడి యున్నది.

1275. ఆమె హృదంతరాళమున నున్న భావమును కప్పిపెట్టిన నేర్పరితనము, ఆమె ముఖభంగిమలోని జాణతనము నా హృదయాగ్నిని చల్లార్చు శైత్యోపచారములు. నే నామె భావమును పుస్తకములో నుండి గ్రహింపగలుగునట్లు గ్రహించితిని. ఈ జగత్తుకొరకై నను నేనిక నామెను వీడజాలను.

ఆమె చెలికత్తె నొంటరిగ సంబోధించును.

1276. అతని చిక్కని కౌగిళ్లలో నే ననన్య ప్రేమ సుఖము ననుభవించుచున్నాను. కాని నా కేదో భయము కలుగుచున్నది. అతని మనస్సులో నన్ను మరల వీడిపోవలెనను భావమున్నట్లు భయము కలుగుచున్నది.

1277. చూడు! చూడు! నాకంటె ముందుగ నా మురుగులే నా నాథుని హృదయ కాఠిన్యతను కనుగొనినవి. *

1278. నా ప్రియుడు నిన్ననేకదా నన్ను వీడినాడు. కాని యేడు దినముల క్రిందటనే నా రూపము వాడిపోయినది. ♦

చెలికత్తె యతనితో నొంటరిగ చెప్పును.

1279. ఆమె తన కంకణములను చూచుకొనెను. పిదప కృశించిపోయిన తన కరమును చూచుకొనెను. ఆ పిదప పాదములవైపు చూచుకొని యా సంజ్ఞలనే నాకు చూపెను.

అతడు చెలికత్తెతో చెప్పును.

1280. తన విరహవేదనను వెల్లడించి యామె నాతో యుద్ధరంగమునకు రాగోరుచు నన్ను ప్రార్థించుచున్నది. నేత్రాభినయము చేతనే దీనిని నా కెరుకపరచిన యామె సౌకుమార్యములోని స్త్రైణ మత్యద్భుత మైనది.

* యుదయమునకు తీగిజిన్న భాగమును గ్రహించి చేతులు సన్నగిల్లును. చేతులనుండి మురుగులు జారిపోవును.

♦ ఆమె దుఃఖము రాబోవు విరహమునకు గూడ దురపిల్లునంత తీవ్రమైనది.

## 129 వ యధ్యాయము

### పరస్పరాలింగన కౌతుకము

# నా యి క

1281. చెలీ ! ఇప్పుడు నాయాత్మ పరమానంద కందళిత మైనది. నా నాథుని తలంచినపుడు నేను స్వర్గములో నుందును. అతని దివ్యసముఖమున నేను పరవశురాల నగుదును. నన్ను నేను మరచిపోవుదును. తలచినంత మాత్రముచేత చూచినంత మాత్రముచేత మధువు సంతోషమును కలిగింపజాలదు. ప్రేమ యట్లు చేయగలదు. ప్రేమ మధువుకంటె నెక్కువ వెర్రి పుట్టించును.

1282. ప్రేమ తాడిప్రమాణము పెరిగినపుడుకోపము నభిన యింపవలెనను కోరిక యావగింజంతయైనను హృదయమున ప్రవేశింప జాలదుకదా !

1283. అతడు నన్ను లక్ష్యపెట్టక తన యాభీష్టమునే యాచ రించినను నాకండ్లు కతనిని చూచువరకు శాంతి యుండనే రదుకదా !

1284. చెలీ ! నిశ్చయముగ నేను కోపగించుకొని తరలిపో వలెనని బయులుదేరి యతని కౌగిలిలో నిరుకుకొని పోవుటొక వింతకాదా ?

1285. కాటుక పెట్టుకొనునపుడు కలము నలుపు కంటికి కాన్పించునా? ప్రియుడు నా చెంత నున్నపుడు ఆతనియందు నాకే దోషము పొడకట్టును.

1286. ఎదుట నున్నపుడతని సుగుణములె ప్రోవు. కంటికి కన్పించనపుడు దోషమేతప్ప మరేదియు నతనిలో కాన్పించదు.

1287. సుడిగుండములో పడినవానివలె నేను కామప్రవాహములో పడితిని. ఇక నేను కోపము నెట్లు వహింపగలను?

1288. అవమానముల పాలగుచున్నను త్రాగుబోతు మధుపానమునే కోరుచుండును. ఓ మాయావీ! నీవక్షఃస్థలము కూడ నాపాలిటి కట్టిదేసుమా!

# నా య కు డు

1289. ప్రేమనవనుమము కంటె కూడ సుకుమారమైనది. దాని పేశల భావమును గుర్తించి మార్దవముతో మెలగువారతి యరుదుగ నుందురు. *

1290. నన్ను చూడగనే యామెకు కుటిలకోపము కలిగెను. కాని నేనామెను సమీపించినపుడు ముందుగనే యామె నాకౌగిలికి వచ్చెను ఆమె ప్రేమ నాప్రేమను మించెత్తెను.

* కోపముచే నీవు నన్ను బాధించుచున్నావు. కనుక నీవు ... తెను రాలవు.

## 130 వ యధ్యాయము

## హృదయమును శపించుట

## నాయిక

1291. హృదయమా ! అతనిహృదయమతని యిచ్ఛనెట్లు సేవించుచున్నదో చూచుచుంటివికదా ! నీవు నాయాజ్ఞల నేల శిరసావహింపవు ?

1292. హృదయమా ! అతడు నన్ను నిర్లక్ష్యము చేయుచుండుటను కండ్లారచూచుచు నీస్నేహితుడైనట్లతని వెంట పరుగిడుదువేల ?

1293. హృదయమా ! నాతోసమిత్రము లేకుండ నీవతని వెంటబడుదువు. దురదృష్టవంతులకు స్నేహితులుండరని నీవు కూడ నాకు బోధించుచుంటివా ?

1294. హృదయమా ! అతనిని పొందుటకు పూర్వమెుకించుక ప్రణయకలహమును నభినయింప నిరాకరింతువేల ? నిన్ను నమ్మి నేనతనిపై నికనెట్లు కుట్రచేయగలను ?

1295. అతడు దొరకడేమోయని భయము. దొరికి తిరిగి పారిపావునేమోయని మరియొకభయము. ఇట్లు నాహృదయమనుభవించు పరితాపమునకంతులేకయున్నది.

1296. హృదయమా ! నీవలన నాకు ప్రయోజనమేమి ? నేనేకాకినై విచారించునపుడు నన్ను మ్రింగివేయుటకు తప్ప నారెందుకును నీవు పనికిరావు.

1297. సిగ్గుబిడియములను విడనాడి వివేకశూన్యమైవర్తించు నాహృదయమునందుగల వాత్సల్యముచేత నామర్యాదను నేనే పోగొట్టుకొంటిని.

1298. నాహృదయమెట్లో జీవింపగోరి యతని సహవాసము నాశ్రయించుచున్నది. అదియతనిని నిందింపవెరచును. నిందించినచో మనగతియే దానికిని పట్టునని దానిభయము.

## నా య కు డు

1299. ప్రియురాలి హృదయమే సహాయపడనిచో నిక దుఃఖార్తుడైనవాని నాదరించు దిక్కెవరు?

1300. నాహృదయమే నాపక్షము* వహింపనపుడు పరులు♦ నన్ను లక్ష్యముచేయకపోవుటలో నాశ్చర్యమేమున్నది?

## 131 వ యధ్యాయము

## ప్రణయ కోపము

## చెలికత్తె స్నేహితురాలితో

1301. చెలీ! అతని నాలింగనము చేసికొనకుము. కొంచెము కోపము నభినయింపుము. అది యతని నెట్లు కాతరపెట్టునో కొంత హాస్యము ననుభవింతుముగాక!

---

* ప్రణయకలహములో నామెపక్షము వహించినపుడు

♦ నాభార్య

1302. ప్రణయకోపము ప్రేమ గాథలోని రుచి. కాని అది ప్రమాణమును మించినచో వ్యంజనములలో ప్రమాణమును మించివేయు లవణమువలెనే యుండును.

భార్య అసూయాగ్రస్తురాలై భర్తను సంబోధించును.

1303. ప్రణయకోప పరీక్షకుడు నీ ప్రియురాలికడకు పొమ్ము. నీవా కోపన నోదార్పకుందువేని గోరుచుట్టుమీద రోకలిపోటువలె నుండదా మరి! నా దుఃఖము సహనయించువా రుండకపోరు. నీ ప్రియురాలిని సమాధాన పరచుకొనుము. లేనిచో నామె శోషిత లతామూలమువలె మూర్ఛిల్లును.

భర్త - స్వగతము

1305. నే నే కళంకము నెరుగను. నిర్దుష్టహృదయుడను ఎంతటి పావనాత్ములకైనను ప్రియురాలి పొలయలుక రసవంతముగ నుండునుకదా!

1306. ప్రియులమధ్య ప్రణయకలహమే లేనిచో ప్రేమ నిజమైన యానందము నొసగజాలదు.

1307. పొలయలుకలో నొక బాధ కలదు. సమాధాన మచిరకాలములో కలుగదేమోయను చింత నన్ను వేధించును.

భ_ర్త - భార్యకు వినిపించునట్లు - తనలో.

1308. నా వలవంతను ప్రత్యక్షముగ నవలోకించి ద్రవీభూతురాలగు ప్రియురాలు దగ్గర లేనపుడు నా దుఃఖములవల ప్రయోజన మేమి ?

1309. శీతల తరుచ్ఛాయల క్రిందనే నీడ సుఖావహముగ నుండును. గాఢప్రేమ కలచోటనె సులభకోపము శోభించును.

1310. ఆమె నన్ను ప్రేమింపదాయెను. నన్నోదార్చుటకు వేగిరపడని వనితకొరకు నా హృదయ మింకను కాంక్షించుచుండుట యవివేకము కాదా !

132 వ యధ్యాయము

పొలయలుకలోనున్న రసనరసములు

# నాయిక

1311. ఓ కపటవేషధారీ ! ఎందరుస్త్రీలునిన్ను తమనేత్రములతో త్రాగివేయుచున్నారో ! నేను నీయాలింగనము నొల్లను.

1312. ప్రియుడు నాచెంతకువచ్చెను. నేను కోపించితిని. పులకమారినట్లతడు నటించి "ప్రియుడా చిరకాలముజీవింపుము!"

అని నేనాశీర్వదించెద ననుకొనెను. కాని నేనుచలింపక యూరకుంటిని.

## నాయకుడు

1313. నేనొక పుష్పదామమును ధరింతునా! 'నీ వేసుందరాంగి దృష్టినో యాకర్షింపగోరుచున్నావు' అని యామె నాపై కార్పణ్యము వహించును.

1314. "నేను నిన్నందరికంటె మిన్నగ ప్రేమింతును" అని యంటిని. వెంటనే యామె కోపము తెచ్చుకొని "ఎవరికంటె, నెవరికంటె" అనినన్ను ముదలకించెను.

1315. "ఈ జీవితములో మనమెన్నడు విడిపోరాదు" అని నేనంటిని. ఆమెవెంటనే కంటతడిపెట్టుకొని దుఃఖించెను. *

1316. "నేను ప్రవాసములోనున్నపుడు నిన్ను స్మరించుకొనెడి వాడను" అని నేననగనే నన్ను గాఢాలింగనము చేసికొన సిద్ధముగనున్న ప్రియురాలు "అనగా నన్నునీవు మరచిపోతివి" అని కోపముతో తరలిపోయెను. ♦

1317. నాకు పులకమారము కలిగెను. నన్నామె యభినందించెను. కాని తోడనే యామెదానిని త్రిప్పి "నీకు పులక

* ముందుజన్మలో విడిపోవచ్చునను తలంపు అతనిమనస్సులో కలదేమోయని యామె భయము.

♦ మరచిపోయిన వస్తువునే మనము స్మరించుకొందుము. మరచి లేనపుడు స్మరించవలసిన యావసర మేమికలదు? అనిభావము.

మారుటకు నిన్నిపు డెవరుతలచుకొంటిరో!" అని కన్నీరు కార్చెను.

1318. పులకమారకుండ నే నాఘకొంటిని. అప్పుడామె "స్నేహితురాండ్రు నిన్ను తలచుకొనుచున్నారు. దానిని నాకు తెలియకుండ నీవుకప్పిపెట్ట గోరుచున్నావు." అని యేడువ సాగెను.

1319. నేనామె నోదార్చుటకు నాకళాకౌశలము నంతను వినియోగించితిని. దీనికామె మరింతకాఠిన్యత వహించి "నీవితరుల పొలయలుకపై చక్కగ సాధనచేసినవాడవు" అని నన్ను దెప్పిపొడుచును.

1320. ఆమె వలపులకు నందచందములకు నానందభరితుడనై నేనామెవైపు చూచుచుండునేని "నాయవయవములను నీవిపు డెవరి యవయవములతో పోల్చుచున్నావు? అని నన్ను గద్దించును.

## 133 వ యధ్యాయము

### ప్రణయకోపములోని సొగసు

## నాయిక

1321. అతనిలో నేదోషము లేదే! అయినను ప్రణయ కోప మొక్కటియే నా కతని యనునయ వచనరచనా కౌశలము చూపు మార్గము.

1322. అతని కృపను తిరిగి పొందుటకు కొంత తడవైన నగుగాక ! అతని కోపములో నొకవింత శోభకలదు. కోపము మరింత నూతన రసానుభూతి కాలంబనమే కదా !

1323. ప్రియుడు మనతో మిళితమైపోయినపుడు ప్రణయ కోపమును మించిన స్వర్గమొకటి కలదా ? అది క్షేత్రము మీదకు నీరములు ప్రవహించున ట్లుండును.

1324. ప్రియునిపై నేను జరుపు ప్రణయకలహములలోనే నా హృదయదుర్గము కీలకమున్నది. అది నన్నే బహిర్గతము చేయుచున్నదే !

## నాయకుడు

1325. ఆహా ! తాత్కాలిక ప్రణయకలహ మెంత రుచికర మైనది. నాలో నేదోషము లేకపోయినను నా కౌగిలినుండి ప్రియురాలి చేతులు తప్పుకొనుటలో నొక యానందము కలదు.

1326. వెర్రిప్రేమ మత్తు కలిగించును. ఎక్కువగా తినుట కంటె తిన్నదానిని జీర్ణము చేసికొనుటలోనే యెక్కువ మాధుర్య మున్నది. అట్లే పరిష్వంగ సుఖముకంటె కలహములో నెక్కువ రుచికలదు.

1327. ప్రణయ కలహములో నింకొక చిత్రమున్నది. అందులో మొదట ఓడిపోయినవారే జయించినవా రగుదురు. పొందు కుదిరిన తక్షణమే యిది మనకు రుజువు కాగలదు.

1328. ఆమె కలహము నొక కొంతసేపు నటించి మా పరిష్వంగ సౌఖ్యములకు మరికొన్ని రుచులను కల్పించునా ?

1329. ఆహా ! ఆమె యధరభంగమును వదనకాఠిన్యతను మరికొంతసేపు అనుభవింతును గాక ! ఓ నివాదేవీ ! నా ప్రార్థనము స్వీకరించి నీపరిపాలన ననంతముగా పొడిగించుము.

1330. ప్రణయకోపము ప్రేమానుభవములలో నొక పసందు. కలహానంతరము పరస్పరగాఢాలింగన చుంబనాదు లొనరించుకొనుట యీ పసందుమీద పసందు.

స మా ప్త ము.

---

# ప్రధాన పోషకులు

శ్రీ పెండ్యాల శ్రీరామ వెంకటకృష్ణ రంగారావుగారు, దొమ్మేరు
శ్రీ కన్నెగొళ్ళ జనార్దన గుప్తగారు, ఏలూరు

# పోషకులు

శ్రీ డాక్టరు తోలేటి కనకరాజుగారు, రాజమండ్రి
శ్రీ సోమిన కామేశ్వరరావుగారు, రాజమండ్రి
శ్రీ యలమర్తి సత్యనారాయణగారు, దొమ్మేరు
శ్రీ కర్రి అచ్చిరెడ్డిగారు, మార్టేరు
శ్రీ జగ్గిరెడ్డిగారు, గోపాలపురం
శ్రీ పెన్మెత్స రాజంరాజుగారు, రేలంగి
శ్రీ నడింపల్లి రామభద్రిరాజుగారు, కోడూరుపాడు
శ్రీ వేగేశిన కనకదుర్గవెంకట సత్యనారాయణరాజుగారు,
శ్రీ దాట్ల చినసీలాద్రిరాజుగారు, పెనుమంట్ర
శ్రీ దాట్ల నరసింహరాజుగారు, పెనుమంట్ర
శ్రీ ఇందుకూరి లక్ష్మీపతిరాజుగారు, దువ్వ
శ్రీ చింతలపాటి ప్రసాదమూర్తిరాజుగారు, పత్తేపురం
శ్రీ ఇందుకూరి కృష్ణంరాజుగారు, దువ్వ
శ్రీ యర్రమిల్లి నారాయణమూర్తిగారు, నర్సాపురం
శ్రీ యలమర్తి నారాయణరావుగారు, తణుకు
శ్రీ చెన్నుభొట్ల భానుమూర్తిగారు, తణుకు
శ్రీ వాజపేయాజుల వెంకటేశ్వర్లుగారు, రాజమండ్రి
శ్రీ కోనాల పేరిరెడ్డిగారు, రాజమండ్రి
శ్రీ ప్రేరేప నరసింహామూర్తిగారు, జీగిడి
శ్రీ దేవులపల్లి శ్రీరామమూర్తిగారు, ఆకిరిపల్లి

శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణగారు, పిప్పర
శ్రీ తటవర్తి కృష్ణమూర్తిగారు, భీమవరం
శ్రీ నూలి వెంకటరత్నంగారు, తణుకు
శ్రీ జవ్వాది లక్ష్మయ్యగారు, పెనుగొండ
శ్రీ చాడ నారాయణమూర్తిగారు, తొండంగి
శ్రీ నముడూరి అచ్యుతరామచంద్రమూర్తిగారు, అమలాపురం
శ్రీ చాడ మంగయ్యసోదరులు, తొండంగి
శ్రీ తుమ్మలపల్లి వీరభద్రరావుగారు, పిప్పర
శ్రీ వత్సవాయి వెంకట్రామరాజుగారు, మంచిలి
శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణ వరప్రసాదరావుగారు, పోతునూరు
శ్రీ అల్లూరి బాపినీడుగారు, కొవ్వూరు
శ్రీ మన్నె బుల్లితిరుపతిరాయుడుగారు, దేవ
శ్రీ కొమ్మారెడ్డి రామనాథంగారు, పోతునూరు
శ్రీ కొమ్మారెడ్డి కృష్ణమూర్తిగారు, పోతునూరు
శ్రీ కొమ్మారెడ్డి వెంకట్రామయ్యగారి కుమార్డు ఆంజనేయులుగారు, పోతునూరు
శ్రీ ముడింబి వెంకటరంగఅనహరాచార్యులుగారు, గూటాల
శ్రీ గొట్టుముక్కల సుబ్బరాజుగారు, మంచిలి
శ్రీ డాక్టరు బొమ్మకంటి నరసింహశాస్త్రి, నిడదవోలు
శ్రీ పసల సూర్యచంద్రరావుగారు, తాడేపల్లిగూడెం
శ్రీ కళ్ళి వెంకటేశ్వరరావు బ్రదర్సు, పూళ్ళ
శ్రీ నూలు లక్ష్మీనారాయణగారు, పెనుగొండ
శ్రీ వినపాముల సీతారామయ్యగారు, గుంటూరు

# The Life of Vinayaka Sawarkar by

**Mudiganty Jaggannasatry, B. A.**

**RAJAHMUNDRY**

If you wanted a book to kindle your sympathies and to occupy your time for not more than 60 Minutes and in that short space to fill you with pathos and patriotic fervour,-then you buy a copy of Vinayaka Savarkar's biagraphy for a rupee and get the full return for your money. The story of his revolutionary activities, his zeal for the emancipation of his motherland, his arrest, his adventures in the French waters, his dip into the ocean, his race for life, his appeal to the french police, his arrest by the Jubhur-dhust of the Britsh pursuer in Marseilles, his trial in India and sentence, his experiences in the Andamans, makes, such pathetic, albeit, rapturous reading that we have no words with which to congratulate the author upon the choice language in which he has clothed the story and the racy style, which adds pique to the language.

(Janmabhumi 3rd May 1928)

---

## Maharani Jhans Lakshmi Bai,

By

Mudiganti Jagganna Sastri, Printed at the Cocanada Printing Works, 1928.

Like the 'Life of Barrister Savarkar' by Mr. Mudiganti Jagganna Sastri, B. A. 'Maharani Jhansi Lakshmi Bhi' by the same author is a welcome edditon to the Palleturi Grandha Mandali. The volume under review is the thirteenth of the series and is a sympathetic account of the life, character and doings of this Indian Joan of Arc, famous in fable and song throughout the Maharashtra country. Born in 1835 brought up in the court of Bajirao II. with his two adopted sons, married to Maharaja Gangadhara Rao of Jhansi Lakshmi Bai became a widow at the early age of 11. The part she played in the Mutiny, the organising capacity that she displayed, the wonderful courage with which she put up a strong fight and her firm determination either to win or die are forcibly described in apt language by the author. Her martial virtues as well as her beauty, piety and humane qualities are strongly set forth. The author tells the story with plenty of animation but also with a near enough approach to objectivity, so that the reader may form his own judgment, of this remarkable woman from the data supplied here. (Hindu)

# Maharani Jhansi Lakshmi Bai

By

M. JAGGANNA SASTRI

**RAJAHMUNDRY**

From the detective novels which are produced by the dozen, and the cheap claptrap which passes for 'drama' we turn with relief to works of surppassing value and perennial interest like this unpertentious volume by Mr. Jagganna Sastri, already well-known to the Telugu reading public as the author of a life of Vinayak Savarkar. Badly printed on inferior paper, and equally bound in a dull green cover, the book is very uninviting in outward appearnce. But once you opened and read through the first few lines, you are held spell-bound by the absorbing interest of the subject as well as the rare charm of the Telugu prose-style. You press through the chapters and book, at single sitting; you lay it down with a sigh of regret that you did not have more of it. To lovers of Indian freedom, 'Sri Lakshmi Bai, is a name to conjure with The author's admiration and reverence for the subject of the sketch is evident in evey line. He has used all the available materials. English, Hindi, and Marathi with great care. The early history of the Principality of Jhansi, the circumstances under which the adoption of an heir

to Maharajah Gangadhara Rao was performed, the unquenchable thirst of Dalhousie for more and more dominion, the thrilling episodes of the 'Indian war of Independence, and the heroic *deeds* of Lakshmi Bai are narrated in great detail. The author has rendered a distinct service to the cause of Telugu literature. We shoud like to see a second edition of this brilliant monograph, printed and bound in a manner worthy of the theme, and adequately illustrated.

(Triveni)